# పారిశ్రామికాభివృద్ధి - విదేశీ అప్పులు

రచన: ఫ్రొలోవ్

అనువాదం: డి. వి. సుబ్బారావు

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

# పరిచయం

మన దేశం, సామ్రాజ్యవాదుల దోపిడివల్ల, వ్యావసాయిక దేశంగానే, పారిశ్రామిక దేశాలకు ముడిపదార్థాలు సరఫరాచేసే దేశంగానే వుండిపోయింది. ఈ స్థితినుండి మనం ముందుకు వెళ్లాలంటే, మన పరిశ్రమలను అభివృద్ధి చేయాలంటే తప్పక విదేశీ పెట్టుబడులను యథాతథంగా వుంచి వేయాలనీ, వాటికి స్వాగతమిచ్చి సకల సంరక్షణాలు "మిత్రత్వ ఒడంబడికల"ద్వారా కల్పించాలనీ, యింతకంటె మార్గాంతరం లేదనీ కాంగ్రెస్ నాయకులు చెపుతున్నారు. విదేశీ పెట్టుబడిదార్లతో అవమానకరమైన ఒడంబడికలు కుదుర్చుకుంటున్నారు.

అయితే వీటిద్వారా పారిశ్రామికం చేయగలమా? లేక పాడుబడిన బీడుగానే దేశం వుండిపోతుందా? ఈ పెట్టుబడులు, అప్పులుతప్ప గత్యంతరంలేదా? విదేశాల అనుభవం ఏమిటి? మనం ఏ మార్గం అనుసరించాలి? అనే విషయాలపై యీనాడు దేశంలో ప్రతిచోటా చర్చలు సాగుతున్నాయి. ఈ చర్చలకు సహాయపడుతుందనే దృష్టితోనే, అత్యల్పకాలంలో అత్యంత పారిశ్రామిక దేశంగా రూపొందిన సోవియట్ రష్యాయొక్క పారిశ్రామిక ప్రణాళికలను, వాటివల్ల కల్గిన సత్ఫలితాలను చక్కగా చిత్రించిన యీ అనుభవాన్ని మీకందజేస్తున్నా.

అనువాదకుడు.

# సూచిక

మీటర్ — 39.37 అంగుళాలు.

హెక్టర్ — 2.47 ఎకరాలు.

పూడ్ — 36 పౌన్లు (షుమారుగా).

సెంటినర్ (రష్యా) — 220.46 పౌన్లు.

# పారిశ్రామికం చేయడంలో సోవియట్ పంథా

సోవియట్ యూనియన్ తన ఆర్థిక వ్యవస్థను పారిశ్రామికం చేయ నారంభించిన సందర్భమున, వివిధ దేశాలలోని ఆర్థిక శాస్త్రజ్ఞులు, పత్రికలవారు, ప్రభుత్వ ఉన్నతోద్యోగులు, యితర ప్రముఖులు అనేకమంది, ఆ సమస్యపై విభిన్నమైన తీర్పుల నిచ్చారు; అసంఖ్యాకమైన పరస్పర వ్యతిరేకమైన ప్రకటనలనిచ్చారు. రష్యా పారిశ్రామికంగా అత్యల్పంగా మాత్రమే అభివృద్ధిమైనదనీ, పెట్టుబడులు పెట్టడానికి ధనం లేదనీ, అందువల్ల పారిశ్రామికంచేసే లక్ష్యాన్ని ఆ దేశం సాధించలేదనీ వారు వాదించారు. ఈ లక్ష్యానికవసరమైన సాధన సామగ్రిని ప్రభుత్వం సేకరించగలదా? ఆ విధంగా సోవియట్ దేశం, అసలు పారిశ్రామికం కావడాన్నే శంకించారు. సోవియట్ యూనియన్‌ను పారిశ్రామికం చేయాలనే పథకాల పట్లా, దాని లక్ష్యాలపట్లా విభిన్న వైఖరులను ప్రదర్శించిన వారంతా ఒక సమస్యపైమాత్రం ఏకమైనారు. విదేశీ పెట్టుబడి లేనిదే సోవియట్ యూనియన్‌ను పారిశ్రామికంచేసే సమస్యయే లేదని వారు ఘంటాపథంగా చెప్పారు.

పారిశ్రామికం చేయడానికిగల మార్గాలూ, సాధనాలపై సోవియట్ యూనియన్‌లో సుదీర్ఘమైన, సువిశాలమైన చర్చలు సాగాయి. దీన్ని సాధించడానికి చిట్కాలేమీ లేవుగదా! సోవియట్ ఆర్థిక అభివృద్ధిలో, పారిశ్రామికంచేయడానికి కావలసిన సాధన సంపత్తిని కూడబెట్టడం ఆచరణలో అత్యంత కష్టతరమైన సమస్య.

విదేశీ పెట్టుబడి లేనిదే ఏ దేశమూ తన ఆర్థికవ్యవస్థను పారిశ్రామికం చేయడం సాధ్యపడలేదని, వివిధ దేశాల చరిత్ర చాటుతున్నది. ప్రతిదేశంలోనూ మొట్టమొదటగా, భారీ పరిశ్రమలకన్న తక్కువ పెట్టుబడితోనే సాధ్యపడునట్టి తేలిక పరిశ్రమలను అభివృద్ధిచేయడం ప్రారంభమైంది. సరుకులను త్వరలోనే అమ్ముకొని, లాభాలను సులభంగా సంపాదించడానికి అవకాశం కల్గింది. కాని యీ విధంగానే పెట్టుబడిని కూడబెట్టి, భారీ పరిశ్రమలను అభివృద్ధి చేయాలన్నట్లయితే చాలాకాలం పట్టివుండేది; అనేక దశాబ్దాలు గడచిపోవలసి వచ్చేది. అందువల్ల పారిశ్రామికాభివృద్ధిని త్వరితం చేయడానికి పెట్టుబడిదారీ దేశాలు విదేశీ పెట్టుబడులను సంపాదించడానికి మార్గాలన్వేషించాయి.

వలస దేశాల ప్రజలను దోచి, సంపాదించిన విపరీతమైన లాభాలు, సంపదల పుణ్యమా అంటూ బ్రిటన్‌లో పారిశ్రామికాభివృద్ధి జరిగింది. 1871 యుద్ధంలో ఫ్రాన్సును జర్మనీ ఓడించింది. నష్టపరిహారం క్రింద ఫ్రాన్సునుండి గోళ్ళూడగొట్టి గుంజుకున్న 5,000 మిలియన్ ఫ్రాంకులను జర్మనీ పారిశ్రామికం కావడానికి వినియోగించింది.

మరికొన్ని దేశాలు విదేశీ అప్పులు, పెట్టుబడులు సేకరించాయి. ఈ విదేశీ అప్పులు పారిశ్రామికం చేయడాన్ని నిరోధించాయి. జార్ రష్యా కూడా యిదే మార్గ మవలంబించింది. జారుసత్వంలో ముంచిన యీ అప్పులు, ప్రభుత్వ ఋణగ్రస్తతను అత్యధికం చేశాయి; వీటిపై వడ్డీలకుగాను పెద్ద పెద్ద మొత్తాలను చెల్లించుకోవలసి వచ్చింది. ఈ సౌకర్యాల

సంకెళ్ళు, మూల పరిశ్రమల వుత్పత్తిని విదేశీపెట్టుబడిదారుల హస్తాల్లోవుంచాయి. రష్యాలోని ఇనుము వుత్పత్తిలో మూడింట రెండువంతులు, ప్లాటినమ్‌లో పదింట తొమ్మిదివంతులు, విద్యుత్పరిశ్రమల్లో పదింట తొమ్మిదివంతులు, పెట్రోల్‌లో మూడింట రెండువంతులు, బొగ్గు దాదాపు మొత్తంగానూ విదేశీ యాజమాన్యంలోనే వున్నాయి. రష్యాలోని పెద్ద బ్యాంకులలోని పెట్టుబడియందు నాల్గింట మూడువాళ్లు విదేశీ బ్యాంకులకు చెందినదే.

ఆర్థికంగా జార్ రష్యా చాలావరకు విదేశ పెట్టుబడిపైననే ఆధారపడి యుండేది. ఈ విదేశ పెట్టుబడిదార్లు రష్యా ప్రయోజనాలను తృణీకరించి, పూర్తిగా స్వప్రయోజనాల కోసమే కృషిచేశారు. రష్యాయొక్క పరిశ్రమల నుత్పత్తిచేసే యంత్రాల, యితర పరికరాల వుత్పత్తిని పరిమితంచేసి, చిన్న పరిశ్రమలు, ముడిపదార్థాలను తయారుచేసే శాఖలను మాత్రమే అనుమతించారు. తద్వారా, బుద్ధిపూర్వకంగా, రష్యాయొక్క పారిశ్రామిక అభివృద్ధి కుంటుపడేలా చేశారు. సాంకేతికంగాను, ఆర్థికంగానూ రష్యా తమపై ఆధారపడి వుండటను అలాగే కొనసాగించాలనీ, తమకు వ్యావసాయిక పదార్థాలను, ముడిపదార్థాలను, యిచ్చే దేశంగానే శాశ్వతంగా వుంచాలనీ, పాశ్చాత్య పెట్టుబడిదారీ ప్రభుత్వాలు ఆశించాయి. రష్యాయొక్క సంపదలను, ప్రజలను కొల్లగొట్టడానికి విశృంఖలమైన అవకాశం వుంచుకోవడం కొరకై ఆ దేశాన్ని వెనకబడిన దేశంగానే వుంచడానికి కృషి చేశారు.

తమ దేశాన్ని పారిశ్రామికం చేయడంలో, సోవియట్ రష్యాకూడా పెట్టుబడిదారీ దేశాలను అనుకరించవలెనా? వలసదోపిడి, యుద్ధాల ద్వారా కొల్లగొట్టడమనునవి సోవియట్ ప్రభుత్వ స్వభావానికే విరుద్ధం. అయితే, బానిసలుగా మార్చే అప్పులు, సౌకర్యాలను తెచ్చుకోవడానికి రష్యా యిష్టపడదు. విదేశ దాస్యంనుండి రష్యాప్రజలను విముక్తులను గావించిన సోవియట్ రాజ్యం, తిరిగి ఆ ప్రజలను సామ్రాజ్యవాద సంకెళ్ళలోకి నెట్టడం కల్ల. అందువల్లనే పారిశ్రామికం చేయడంలో నూతన పంథాను, అపూర్వమైన పంథాను కనుగొన వలసి వచ్చింది.

ఈ మార్గాన్ని లెనిన్ - స్టాలిన్‌లు వేశారు. దేశంలో నున్న నిల్వలతోనే భారీ పరిశ్రమలు అభివృద్ధిచేయడం, అందుకొరకై తమ స్వంత సాధన సామగ్రినే వినియోగించడం-ఇదే సోషలిస్టు పారిశ్రామిక పంథా. ఇది కంటకావృతమైన మార్గమే. అప్పటికి రష్యాలో, పారిశ్రామికాభివృద్ధికి మూలస్తంభమూ, భారీ పరిశ్రమలకు హృదయమైన యంత్రాలను తయారుచేసే పరిశ్రమ, భారీ పరిశ్రమ, రెండూకూడా అత్యల్పంగానే అభివృద్ధియైనాయి. 1913 సం॥పు మొత్తం పారిశ్రామికోత్పత్తిలో నూరింట 6.8 వంతులు మాత్రమే యంత్రాలను తయారుచేసే పరిశ్రమల వుత్పత్తి వుంది. అందువల్లనే, భారీపరిశ్రమలను దాదాపు పునాదినుండే కట్టవలసి వచ్చింది.

ఇదొక్కటే సుస్థిరమైన, సురక్షితమైన మార్గం. చరిత్ర చూపిస్తున్న, లోగడ దేశాలు పయనించిన మార్గం - చిన్న పరిశ్రమలద్వారా సాధనసంపత్తిని కూడబెట్టి, దీర్ఘ కాలానంతరం

భారీ పరిశ్రమలలోకి మార్చుట - వాంఛనీయంగాదు. ఆ మార్గాన్నే పయనించినట్లయితే దేశానికి చాలా కాలం వరకు భారీ పరిశ్రమలు వుండేవిగాదు. ఆర్థికంగా పెట్టుబడిదారీ దేశాలపై ఆధారపడవలసి వచ్చేది. అందువల్లనే, భారీ పరిశ్రమలను అభివృద్ధిచేయ నారంభించి, సోవియట్ యూనియన్‌ను పారిశ్రామికం చేయ సమకట్టాలని నిర్ణయించడమైనది. ఉత్పత్తి సాధనాల వుత్పత్తిని అభివృద్ధిపర్చుట ద్వారానే, స్వంతంగా యంత్రాలను నిర్మించే పరిశ్రమలను నెలకొల్పడం ద్వారానే, అత్యల్ప వ్యవధిలో వ్యావసాయిక దేశాన్ని పారిశ్రామికం చేయడం సాధ్యమయింది. ఇలా చేయాలంటే తగినన్ని సాధనాలు వుండాలి.

దేశాన్ని పారిశ్రామికం చేయడంలో స్వంత సాధనాల ద్వారానే పని సాగించాలనే విధానాన్ని సోవియట్ ప్రభుత్వం ఆచరించింది. అంత మాత్రాన విదేశ సహాయం రష్యాకు అక్కరలేదనిగాని, ఆ సహాయాన్ని రష్యా స్వీకరించదనిగాని అనుకోరాదు. పైగా, తమ ప్రణాళికలకు కోట్లరూపాయల పెట్టుబడి అవసరం గావడంవల్ల విదేశీ పెట్టుబడిని సంపాదించాలని రష్యా ఆశించింది. అప్పులు తీసుకోవడానికీ, మంచి వడ్డీ రేట్లు యివ్వడానికి సోవియట్ ప్రభుత్వం సంసిద్ధతను ప్రకటించింది. అయినా ఏ విదేశీ ప్రభుత్వమూ సోవియట్ ప్రభుత్వంతో ఒడంబడికలు చేసుకోలేదు.

## ౬

# సోవియట్ రష్యా - దురాశాపరులైన సామ్రాజ్యవాదులు

ఎందుకు ఒడంబడికలు చేసుకోలేదు? ఏమి అడ్డంకులు వచ్చాయి? సోవియట్ రష్యాలో తమ పెట్టుబడిని వినియోగించి డబ్బు గడించడం విదేశీ పెట్టుబడిదార్లకు యిష్టం లేదా?

డబ్బు సంపాదించడం వారికిష్టమే. పూర్వం, తాము పెట్టిన పెట్టుబడులపై లాభాలు, అప్పులపై వడ్డీల రూపేణా సాలీనా నూరు కోట్ల బంగారు రూబుల్స్ తీసుకొని వెళ్లేవారు. రష్యా ప్రభుత్వ రాబడిలో యిది మూడోవంతు. ఇదంతా వారికి తెలిసియున్నదే.

అదంతా, ఈనాడు రూపుమాసిన, ఆనాడు అధికారంలో వున్న జార్ రష్యా; పెట్టుబడిదారీ భూస్వాముల రష్యా. 1917 మహా విప్లవం రష్యాలో పెట్టుబడిదారీ విధానాన్ని రద్దుచేసి దాని స్థానే నూతన సాంఘిక వ్యవస్థ నెలకొల్పింది. సోవియట్ సామ్యవాద రిపబ్లిక్ స్థాపించబడింది. స్వదేశీ, విదేశీ పెట్టుబడిదార్ల లాభాలు రద్దు చేయబడ్డాయి. తమ స్వలాభాలను తిరిగి పొందుటకై, సోవియట్ రిపబ్లిక్‌ను నేల రాచివేసి, పెట్టుబడిదారీవిధానాన్ని పునః స్థాపించాలని వారు నిశ్చయించుకున్నారు. 14 దేశాలు సాయుధ జోక్యాన్ని ప్రారంభించాయి. సోవియట్‌పై దండెత్తాయి. ఈ ప్రయత్నం ఓడిపోయింది. సోవియట్ ప్రజలు యీ దురాక్రమణదారులను, మాతృదేశాన్నుండి తరిమి వేశారు. సోవియట్ దేశంలోనికి జొరబడాలనే తమ

నిశ్చయాన్నిగాని, రష్యాయొక్క అపారమైన ఖనిజ సంపదలను సంపాదించాలనే తలంపునుగాని, సోవియట్ ప్రజలను దోపిడి చేయడంద్వారా విశేషమైన లాభాలు ప్రోగుచేసుకోవాలనే దురాశనుగాని సామ్రాజ్యవాదులు త్యజించలేదు. సోవియట్ ఆర్థిక వ్యవస్థపై పెత్తనం వహించి, వశమొనర్చుకొని, దాన్ని స్వప్రయోజనాలకై వుపయోగించుకొని, సోవియట్ ప్రజల సిరిసంపదలను కొంగిలించాలని, జార్ రష్యాలోలాగే చేయాలని, సామ్రాజ్యవాదులు ఆశించారు.

సోవియట్ ఆర్థికవిధానంపై పెత్తనం వహించవలెనని సామ్రాజ్యవాదులు కలలు గన్నారు. వారు అప్పుడు రష్యా ప్రభుత్వం పట్ల వహించిన వైఖరిలో ఇది ప్రతిబింబించింది. వారు "బంగారపు బహిష్కారాలు" (సోవియట్ బంగారాన్ని అమెరికా, బ్రిటిష్, ఫ్రెంచి బ్యాంకులు తీసుకొన నిరాకరించాయి); అప్పు నిషేధాలు విధించారు; సోవియట్ ప్రభుత్వానికి కావలసిన వస్తువులను అమ్మడానికి నిరాకరించారు; సోవియట్ వస్తువులను కొనలేదు; వాటిపై 'నిషేధాలు' అమలు పర్చారు. ఆఖరుకు సోవియట్ రష్యాను వశం చేసుకోడానికి 'డాయస్ పథకం' అనుపేర నొక ప్లానుకూడా వేశారు.

ఈ పథకాన్ని, జర్మన్ యుద్ధాపరాధపు సంఘము రూపొందించింది. దాని అధ్యక్షుడైన ఛార్లెస్ జి. డాయస్ పేర దీనికి నామకరణం చేశారు. ఈ పథకం చాలా ముఖ్యమైన ఆశయాలతో నిండివున్నది. దాని సారాంశం యిది: అమెరికా నుండి జర్మనీ అప్పు తెచ్చుకొని, తన పారిశ్రామికాభివృద్ధికి వుపయోగించుకోవాలి; పరికరాలను, విస్తృతంగా, విపరీతమైన

వెలకు విదేశీ మార్కెట్‌లో, ముఖ్యంగా రష్యాకు అమ్మాలి. దానికి బదులుగా రష్యానుండి ముడిపదార్థాలను, వ్యావసాయిక పదార్థాలను సంపాదించాలి. ఆ పథకం ద్వారా, యీ క్రింది ఫలితాలు వస్తాయని ఆశించారు: ఒకవైపున రష్యానుండి, యితర దేశాలనుండి జర్మనీ సంపాదించిన డబ్బునుండి తమకు రావలసిన యుద్ధనష్టాన్ని రాబట్టుకోవచ్చు. రెండోవైపున, సోవియట్ పరిశ్రమలు పెట్టుబడిదారీ యూరప్ లోకకు ముడి వేయబడుతాయి. తన స్వంత వుత్పత్తి పరిశ్రమలు అభివృద్ధి గాక, వ్యావసాయిక దేశముగానే, పెట్టుబడిదారీ దేశాలకు ముడి పదార్థాల సరఫరాదారుగానే రష్యా వుండిపోతుంది. ఒక్క దెబ్బతో రెండు పిట్టలు! ఇదీ, యీ ప్రణాళికా రచయితల వుద్దేశం. ఈ పథకంయొక్క అసలు లక్ష్యం, రష్యాను వలస దేశముగా మార్చడమే.

దెబ్బతినియున్న జర్మన్ పారిశ్రామికులకు, రష్యాను పథ్యంగా వుపయోగించుకొని "కోలుకోవాలనే" వుద్దేశం బాగానే నచ్చింది. ఆ కాలంలోని జర్మన్ పెట్టుబడిదారీ అర్థ శాస్త్రజ్ఞుడు, ఎకార్డ్ ప్రకటన గమనార్హం. ఆర్థికంగా బలహీనంగానున్న సోవియట్ ప్రభుత్వం తప్పకుండా యీ పథకాన్ని ఆమోదించి తీరాలనీ, అది ఆలోచనలోనే వున్నదనీ ఎకార్డ్ వూహించాడు. ఆయన యిలా అన్నాడు: "స్వంత వుత్పత్తి పరిశ్రమను కలిగి వుండడం" రష్యాకు లీలగానే వుంటుంది. "రాబోయే పది సంవత్సరాలవరకు ముడి పదార్థాల సరఫరా దారుగానే రష్యా వుంటుంది".

రష్యాను ఆర్థిక దాస్యంలో నుంచడానికి వుద్దేశించి బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు రూపొందించిన యీ పథకం, జర్మన్ పెట్టుబడిదార్లకు ఆమోదయోగ్యంగానే వుంది. కాని రష్యా దీన్ని అంగీకరించదనడం నిస్సందేహం. విదేశీ పెట్టుబడిపై ఆధారపడుట అనునది సోవియట్ ప్రజల ప్రయోజనాలకు విరుద్ధం. అందువల్లనే సోవియట్ ప్రభుత్వం "డాయస్ పథకాన్ని" నిరాకరించింది. పాపం! సామ్రాజ్యవాదుల వూహా సౌధాలు నేలగూలాయి!

## బానిసత్వాన్ని తెచ్చిపెట్టే అప్పులను సోవియట్ అంగీకరించదు

ఇతరదేశాలను ఆర్థిక, రాజకీయ దాస్యంలో ముంచుటలో, గతంలోను, యిప్పుడుకూడా, అప్పులు అనునవి సామ్రాజ్యవాదుల చేతులలో సాధనంగా వినియోగ పడుతున్నాయి. ఇట్టి అప్పులను, మంజూరు చేసేటపుడు సామ్రాజ్యవాద దేశాలు, అప్పుదారీ దేశాలపై ఆర్థిక పెత్తనాన్ని నెలకొల్పి ఆ దేశాలను దాస్యంలో వుంచుతాయి. ఆర్థిక పెత్తనం, ఆర్థిక పరాధీనతలు క్రమంగా రాజకీయ పెత్తనం, రాజకీయ పరాధీనతకు దారి తీస్తాయి. వలస అధీన స్థితిలోనే సోవియట్ రష్యాను అట్టి పెట్టడం తమ ముఖ్యకర్తవ్యంగా ఎంచారు పాశ్చాత్య

సామ్రాజ్యవాదులు. దానికి కావలసిన కృషి అంతా కావించారు. అప్పులసంకెళ్ళలో సోవియట్ ప్రభుత్వాన్ని బధించాలనుకున్నారు.

సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా విదేశీ సామ్రాజ్యవాదులనేక పన్నాగాలువేసి ఆచరణలో పెట్టాలని ప్రయత్నించారు. సోవియట్‌లో నున్నది సోషలిస్టు సాంఘిక వ్యవస్థ అయినందువల్లనే దాన్ని కూలద్రోయడానికి కుట్రలు పన్నినారు. అట్టి సందర్భమున, సోవియట్ ఆర్థికవ్యవస్థను పట్టుకొనడానికి అప్పులను సాధనాలుగా చేయ నుద్దేశించారంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. దురాక్రమణకు పూనుకోవడం, యితర దేశాలలోనికి చొరబడడం, ముడిపదార్థాల నిక్షేపాలను, మార్కెట్టులను, పట్టుకోవడం, యితర దేశాలను ఆర్థిక, రాజకీయ దాస్యంలోనికి యీడ్చడం, ఆ దేశాల ప్రజలను అమానుషంగా దోపిడీచేయడంగా - ఇవీ సామ్రాజ్యవాదపు విశిష్టమైన, స్వభావసిద్ధమైన లక్షణాలు. ఇంకోమాటలో చెప్పాలంటే, ఇది గుత్త పెట్టుబడిదారీ విధానపు ప్రత్యేక లక్షణపు ఫలితమే. సామ్రాజ్యవాదపు ప్రారంభదినాల్లో పారిశ్రామికంగా స్వల్పంగానే అభివృద్ధియైన దేశాలను పట్టుకొని, వాటిని వలస దేశాలుగా మార్చడంలో, యిదే విధానాన్ని సామ్రాజ్యవాదం అనుసరించింది. ఇప్పుడు జరుగుతున్నదికూడా యింతే. తమకంటె తక్కువగా అభివృద్ధియైన దేశాలను, - అవి పారిశ్రామిక దేశాలుకూడా గావచ్చు - పట్టుకొని, స్వాధీనపచ్చుకొని, అధీన దేశాలుగా మార్చుతున్నాయి. ప్రస్తుతం యీ పరాధీనతలో ఒక్క వలసదేశాలు మాత్రమేగాక, అభివృద్ధి

చెందిన పెట్టుబడిదారీ దేశాలుసైతం చిక్కుకున్నాయి. ప్రపంచాధిపత్యంకోసం నాలుకలు చాస్తున్న అమెరికా గుత్తదార్ల 'మార్షల్ దాస్యంలో' యిట్టి దేశాలున్నాయి.

సోవియట్ రష్యాను దాస్యంలోకి తేవాలనే తమ లక్ష్యానుసారంగా పాశ్చాత్య సామ్రాజ్యవాదులు, రష్యాపై అప్పులపేరిట దాస్యశృంఖలాలు తగిలించాలని ప్రయత్నించారు. సోవియట్ ఆర్థికవ్యవస్థ విదేశ అప్పులపై ఆధారపడేలాగుననూ, పెట్టుబడిదారీ ఆర్థికవిధానానికి ముడిపదార్థాల సరఫరాదారుగామాత్రమే, వ్యావసాయిక దేశంగానే అట్టిపెట్టాలని వారు వాంఛించారు. 1922 లో జరిగిన జినోవా మహాసభలోనే యీ ప్రశ్న సోవియటు ప్రభుత్వం ముందరికి వచ్చింది. ఆ కాలంలో, సోవియటు దేశపు ఆర్థిక స్వాతంత్ర్యానికి హానికరమగు షరతులను పశ్చిమ యూరప్ సామ్రాజ్యవాద ప్రతినిధులు సూచించారు. తరువాతకూడా పాశ్చాత్య దేశాల సామ్రాజ్యవాద ప్రభుత్వాల యీ దురాశను సోవియటు ప్రభుత్వం ఎదుర్కోవలసి వచ్చింది.

అయితే, సోవియట్ ప్రభుత్వం మాత్రం, సామ్రాజ్యవాదులు నెట్టాలనుకున్న బాటలోనికి కాలిడలేదు. దాస్యశృంఖలాలు తగిలించే అప్పులను దృఢచిత్తంతో నిరాకరించింది. సమాన హోదాలో పరస్పర క్షేమంకోసం, పెట్టుబడిదారీ దేశాలన్నింటికోనూ సహకరించడానికి సోవియట్ యూనియన్ తన సంసిద్ధతను ప్రకటించింది. ఒక దేశం మరో దేశం యొక్క సర్వస్వాతంత్ర్యాన్ని గౌరవించి, యితరుల అంతర్గత వ్యవ

హారాలలో జోక్యం కల్పించుకొనకుండినట్లయితే, దేశాలమధ్య సాధారణమైన సహకారం నెరపడం సాధ్యమేనని సోవియట్ ప్రభుత్వం సదా విశ్వసిస్తున్నది.

## ప్రత్యేక సౌకర్యాలు కోరరాదు

సోవియట్ యూనియన్‌లో విదేశీ ప్రయోజనాలు వేరూనలేదు. ప్రారంభదినాలలో విదేశీపెట్టుబడికి సౌకర్యాలు కలిగించడానికి సోవియట్ యూనియన్ సిద్ధపడింది. దానికై ప్రత్యేక శాసనాన్ని ప్రకటించింది. అయితే, యీ సౌకర్యాల ద్వారా సోవియట్‌ను బానిసత్వంలో ముంచడానికి అవకాశం లేనట్టి, పరస్పర లాభదాయకమైనట్టి, విధానపు ప్రాతిపదిక పైననే యీ శాసనం ఆధారపడింది. దేశంయొక్క ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాన్ని కాపాడ్డానికై, కొన్ని రంగాలలో మాత్రమే సౌకర్యాలు కల్పించడానికీ, స్పష్టమైన హద్దుల మధ్యనే, సోవియటు కార్మిక శాసనాన్ని తు. చ. తప్పకుండా అనుసరించే హామీపైననే, యీ సౌకర్యాలు కల్పించబడ్డాయి. ఇంతటితో పెట్టుబడిదార్ల తృష్ణ చల్లారలేదు. అదనపు సౌకర్యాలు కావాలన్నారు.

పెట్టుబడిని పెట్టడం, అప్పులు యివ్వడం వగైరాలను సాధనంగా చేసుకొని సోవియట్ రష్యాలోని పరిశ్రమలను, ముడి పదార్థాల నిల్వలను కబళించడానికి వారుద్దేశించారు.

సోవియట్‌కు స్వంత పెట్టుబడి లేనందువల్ల, విదేశీ పెట్టుబడులపై కంట్రోలు వుంచడానికి సోవియట్ ప్రభుత్వం విధించిన షరతులను పరిత్యజిస్తుందని వారూహించారు. ఇందువల్లనే, సోవియట్ ప్రభుత్వం ప్రకటించిన సౌకర్యాలకు ఆమోదించ నిరాకరించారు. తమకు తప్పకుండా, సోవియట్ ఆర్థిక వ్యవస్థపై పెత్తనం ఏర్పడుట కవకాశం కల్గించే సౌకర్యాలను చివరకు పొందగలమనే ధీమాతో నున్నారు. అయితే వారి ఆశలు నిరాశలైనాయి.

అందువల్ల కొన్ని చిన్న మధ్యతరగతి పరిశ్రమలకు సంబంధించినంతవరకే కొన్ని ఒడంబడికలు కుదిరాయి. సోవియట్ ఆర్థికాభివృద్ధిలో యివి ఎట్టి పాత్రా వహించలేదు. 1925-26 ఆర్థిక సంవత్సరంలో రష్యాయొక్క మొత్తం వుత్పత్తిలో, వ్యక్తిగత పరిశ్రమల వుత్పత్తి నూటికి నాల్గువంతులు మాత్రమే వుంది. కొద్దిగానే వున్న యీ వ్యక్తిగత పరిశ్రమలలో విదేశీ పెట్టుబడులు అత్యల్పం.

పెట్టుబడిదార్లు మరోసారి తప్పు అంచనా వేశారు! సోవియట్ యూనియన్‌లో పరిశ్రమలు ఎంతో వేగంగా అభివృద్ధి గావడాన్ని వారు చూచారు. సోవియట్ భూగర్భ శాస్త్రజ్ఞులు వెలలేని నూనె, ఇనుము, బొగ్గు, యితర ఖనిజాలు కనుగొన్నారు. దీనితో సామ్రాజ్యవాదులకు నోరు వూరింది. తమ సహాయం యిస్తామని చెప్పారు. అయితే అప్పటికే సోవియట్ ఆర్థిక వ్యవస్థ బలవత్తరమైనది. ఇతర దేశాల పెట్టుబడి సహాయం కోరకుండా, తమ శక్తి, సాధన సామగ్రితోనే యీ అమూల్యమైన కాణాచిని వుపయోగించుకొనగలిగారు.

కోన్రాడ్స్కీ ముడిఖనిజ నిక్షేపాలను అభివృద్ధిచేసి, బాల్కాష్ రాగి కర్మాగారాన్ని నిర్మించడం దీనికొక చక్కని వుదాహరణ. బాల్కాష్ ప్రాంతంలో ఖనిజ సంపద కనుగొన బడిందనేవార్త విదేశాలకు తెలియగానే, ఆ ప్రాంతంలో తమ కంపెనీ పెట్టడానికి తన కనుమతి నీయమని లెస్లీ ఉర్క్హార్ట్ అనే ఇంగ్లీషు పెట్టుబడిదారు సోవియట్ ప్రభుత్వాన్ని కోరాడు. అతను తన నోట్ పుస్తకంలో, పొగరుబోతు తనంతో యిలా వ్రాసుకున్నాడు :

"బాల్కాష్, దాని పైనవున్న కిర్గిజ్ స్టెప్పీలను త్రవ్వడానికి నా కవకాశం యివ్వరా? యీ ప్రదేశాల్లో మీరేదైనా చేయాలంటే మీకు 50 లేదా 100 సంవత్సరాలు పడుతుంది."

సోవియట్ యూనియన్లో జరుగుతున్న ఆర్థిక, సాంఘిక మార్పుల స్వభావం యీ గర్విష్టికి అంతు చిక్కలేదు. ఇది, ఆ నాటి పాశ్చాత్య వ్యాపారులకు, రాజకీయవేత్తలకు గల అంచనాలనే తెలియజేస్తుంది. ఇది 1928 నాటి స్థితి. సరిగ్గా ఒక్క సంవత్సరానికే, (వంద సంవత్సరాలు కాదుసుమా!) సోవియట్ ప్రజలు, స్వదేశంలో తయారు చేయబడ్డ పరికరాలతోనే కిర్గిజ్ స్టెప్పీలకు చేరుకున్నారు. అనతి కాలంలోనే, యూరప్ అంతటిలోనూ పెద్దదగు బాల్కాష్ రాగి శుద్ధి కర్మాగారాన్ని నిర్మించారు.

యుద్ధంవల్లనూ (1914-18), దురాక్రమణ యుద్ధం వల్లనూ చాలావరకు రష్యా ఆర్థికవ్యవస్థ దెబ్బతిన్నది. సోవియట్ ప్రభుత్వం స్వతంత్రంగా తన స్వంతశక్తుల సహాయంతోనే యీ ఆర్థికవ్యవస్థను పునర్నిర్మించుకోవడం సాధ్యం

గాదని బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు ఆశించారు. వారిలాగే అంచనాలు వేశారు. తదనుకూలంగానే ప్రవర్తించారు. అయితే వాస్తవాన్ని గుర్తించక తప్పలేదు. 1926 వచ్చేసరికే సోవియట్ ప్రజలు కష్టపడి పనిచేసి యుద్ధాత్పూర్వపు పారిశ్రామికోత్పత్తి స్థాయిని చేరుకున్నారు. నిశ్చితంగా అభివృద్ధి పొందసాగినారు.

## స్వశక్తి, సాధనములతోనే పారిశ్రామికం చేయుట

1928 లో సోవియట్ యూనియన్, స్టాలిన్ పారిశ్రామిక ప్రణాళికను అమలుపర్చ నారంభించింది. జాతీయార్థిక విధానాభివృద్ధికి వుద్దేశింపబడిన ప్రథమ పంచవర్ష ప్రణాళిక రూపొందింది. అమోదించబడింది. ఈ ప్రణాళికలో నిర్దేశించబడిన లక్ష్యాలు, ప్రణాళిక నిర్వచించిన అభివృద్ధి వేగము, విస్తృతి, చూచి ప్రపంచం విస్తుపోయింది. ఈ ప్రణాళిక నిర్వహింప బడుతుందని చాలామంది పెట్టుబడిదారీ నాయకులు విశ్వసించలేదు. వెనుకబడి, వ్యావసాయికంగానేవున్న దేశాన్ని పారిశ్రామికంచేసి, శక్తివంతముగా రూపొందించి, సంపూర్తిగా స్వయంపోషకమగు, విదేశీ పెట్టుబడిదారీ సమాజంనుండి స్వతంత్రంగా వుండడానికి స్తోమతు గల్గిన దేశంగా రూపొందించడమే సోవియట్ ప్రభుత్వ ప్రధానోద్దేశం. దీనివల్ల, పరిశ్రమను,

రవాణా, వ్యవసాయములను పునర్వ్యవస్థీకరించడానికి తగినంతగా అధునాతనమైన యంత్రాలను తయారుచేసే పరిశ్రమలను నెల కొల్పాల్సి వచ్చింది. దీన్ని సాధించాలంటే భారీ పరిశ్రమ, దాని కవసరమైన యంత్రాల నుత్పత్తిచేసే పరిశ్రమను సర్వ విధాలా అభివృద్ధిచేయుట అవసరం. యంత్ర పరికరాలను దిగుమతి చేసుకుంటున్న సోవియట్ యూనియన్‌ను పరికరాల నుత్పత్తిచేసే దేశంగా మార్పుచేయడానికి యిదొక్కటేమార్గం. ఈ మార్గాన నడిస్తేనే ఆర్థికస్వాతంత్రం సురక్షితంగా వుంటుంది. బ్రహ్మాండమైన పరిశ్రమలను అసంఖ్యాకముగా నిర్మించాలనీ, అనేక కొత్తపరిశ్రమలను నెలకొల్పాలనీ ప్రథమ పంచవర్ష ప్రణాళిక నిర్దేశించింది. ఈ ప్రణాళికయొక్క విస్తృతీ, వేగమూ పెట్టుబడిదారీ సమాజపు నాయకులకు వూహాతీతంగా నున్నవి. అందువల్లనే యీ ప్రణాళిక భగ్నమై తీరుతుందని జోశ్యం చెప్పారు. ఇదంతా "కల్పన", "కల", "ప్రచారం" అని నామ కరణాలు చేశారు.

ఆనాడు బూర్జువాపత్రికల్లో యిట్టి జోశ్యాలూ, తీర్పులూ అనేకం వచ్చాయి. "రష్యా వ్యవహారాల్లో నిపుణులు" అనుకో బడేవారి ఆలోచనా విధానం ఎలావుందో చూడండి. ప్రముఖ జర్మన్ వ్యాపారీ, "రష్యన్ కమిటీ" అని పిలువబడు సంస్థకు అధ్యక్షుడూ అయిన క్రేమర్ యీ దిగువ ప్రకటనచేశాడు:

"ఈ పంచవర్ష ప్రణాళిక 50 సంవత్సరాలలో పూర్తి చేయబడితే ఘనతే. అదీ ఒక వూహ మాత్రమే."

50 సంవత్సరాలకు కూడా వూహయేనట! సోవియట్ పంచవర్ష ప్రణాళికనుగురించి పెట్టుబడిదారీ నాయకులఅంచనాలు

యివి. కాని సోవియట్ ప్రజలు మాత్రం 5 ఏళ్ళ ప్రణాళికను నాల్గు సంవత్సరాల మూడు నెలల్లోనే పూర్తిచేశారన్నది జగద్విదితమే.

సోవియట్ పంచవర్ష ప్రణాళికను గురించి జోశ్యం చెప్పినవారూ, విమర్శించినవారూ ఏ ప్రాతిపదికపై నిలబడ్డారు? ప్రథమంగా: సోవియట్ పంచవర్ష ప్రణాళిక నిర్ణయించిన పారిశ్రామికోత్పత్తి రేటు, మంచిరోజులలో అమెరికా, బ్రిటన్, జర్మనీ సాధించిన అభివృద్ధి రేటుకంటె అనేక రెట్లున్నందువల్ల యిది పూర్తిగా అసాధ్యమని వారివాదన. రెండోది: పంచవర్ష ప్రణాళికయొక్క కార్యక్రమాన్ని నిర్వహించుటకు అవసరమైన సాధనసామగ్రి దేశంలో లభించదని వారి దృఢవిశ్వాసం. సోవియట్ యూనియన్‌కు అప్పుపెట్టే ప్రశ్నను తిరిగి లేవనెత్తాలని వారి వుబలాటం. అప్పులుపెట్టి రక్షణ నిబంధనలపేరిట, సోవియట్ ఆర్థికవ్యవస్థపై పెత్తనం సంపాదించి, తమ ఆజ్ఞలను రుద్దాలని వారి వాంఛ.

ఈ ప్రణాళికలోని, పరిశ్రమలలో పెట్టుబడులు పెట్టే కార్యక్రమాన్ని నిర్వహించడానికి కావలసిన ధనాన్ని కూడ పెట్టడానికి కొన్ని దశాబ్దాలు పడుతుందనీ, అందువల్ల దాన్ని నిర్వహించడం సోవియటు ప్రభుత్వం చేతగాదనీ విశ్వసించిన వారు సోవియటు యూనియన్‌లోకూడా వున్నారు. అందువల్ల "అమెరికాతో మంచిగా మాట్లాడి, అప్పుకు ప్రయత్నాలు చేయాలి" అని వారు సలహా యిచ్చారు. విదేశీ అప్పులు, ముఖ్యంగా అమెరికా అప్పులు లేనిదే సోవియటు పరిశ్రమాభివృద్ధి గాదని నుడివిన "సైద్ధాంతికులు"కూడా వెలిశారు. ఫలితం

సంగతి ఆలోచించకుండా విదేశీ పెట్టుబడులను ఆహ్వానించమని సోవియట్ ప్రభుత్వాన్ని త్వరపెట్టారు. కాని వీరు పారిశ్రామికం చేయడానికే ప్రతికూలురు. వీరు తమ దేశీయుల ప్రయోజనాలనుగాక విదేశీ పెట్టుబడుల ప్రయోజనాలను సంరక్షిస్తున్నారు. సోవియట్ యూనియన్ యొక్క పారిశ్రామికాభివృద్ధిని విచ్ఛిన్నంచేసి, బానిసత్వంలోవుంచి, వ్యావసాయిక దేశంగా వుంచాలనుకుంటున్న సామ్రాజ్యవాదపు ఏజంట్లు వీరు. కొంత కాలమైన తర్వాత వీరిపాత్ర పూర్తిగా బహిర్గత మొనర్చబడింది. వీరు సిద్ధాంతరీత్యా మాత్రమే పెట్టుబడిదారీ విధానపు ప్రచారకులు గాలేదు; విదేశీ పెట్టుబడిని ప్రోత్సహించడంలో వీరికి వ్యక్తిగతమైన లాభంకూడా వుంది.

లోగడ చెప్పినట్లుగా సోవియట్ ప్రభుత్వం విదేశీ అప్పులకు విముఖంగాదు; వాటిని సంపాదించాలని ఆశించింది. దేశీయార్థిక విధానంపై విదేశీ పెట్టుబడుల పెత్తనాన్ని నిరోధించే షరతుపైననే అప్పులను స్వీకరించ సిద్ధంగావుంది. సోవియట్ యూనియన్ యొక్క ఆర్థిక స్వయంపోషకత్వాన్నీ, స్వతంత్రాన్ని రక్షించడమే పారిశ్రామికంయొక్క లక్ష్యంగనుక ఎంత అవసరం వున్నప్పటికీ, బానిస అప్పులను స్వీకరించడానికి నిరాకరించింది.

విదేశాలలో అరువుగా కొన్నవాటి విషయంలోకూడా సోవియట్ ప్రభుత్వం అనేక యిబ్బందులు పడవలసివచ్చింది. దేశంలోని ఆర్థిక విధాన పునర్నిర్మాణం అత్యంత వేగంగా సాగుతున్నది. కాని విదేశీ వ్యాపారంమాత్రం స్వల్పంగానే పెరిగింది. ఈ రెండిటికీ పొంతన కుదరలేదు. 1926 వచ్చేసరికి

పారిశ్రామికోత్పత్తి యుద్ధాత్పూర్వపు స్థాయిని చేరుకున్నది. విదేశీ వ్యాపారంమాత్రం ఆ స్థాయిలో సగమైనా లేదు. దీర్ఘ కాలిక ఋణాలసంగతి చెప్పనక్కరలేదు. స్వల్పకాలిక అప్పులుకూడా అతి కష్టంమీదగాని లభ్యం గావడంలేదు. పాశ్చాత్య దేశాల పెట్టుబడిదార్లు తమ అనువు విధానాన్ని "రష్యన్ మార్కెటును పట్టుకోవాలనే" లక్ష్యంతో ముడి వేశారు. సోవియటు మార్కెటులోనికి స్వేచ్ఛగా జొరబడి, తమ వ్యాపారపు సరకులతో ముంచివేసి, ఆ దేశపు పారిశ్రామి కాభివృద్ధిని అరికట్టడానికి కృషి సల్పినారు.

విదేశీ ఆర్థిక జోక్యమునుండి దేశమును పరిరక్షించ గలిగినది తమయొక్క విదేశ వ్యాపారముపై గల సంపూర్ణాధి కారమేనని సోవియటు ప్రభుత్వం గుర్తించింది. అందువల్లనే యీ సంపూర్ణాధికారాన్ని సంరక్షించుకుంటూ, బలవత్తరం చేసుకున్నది. ఇది గుర్తెరింగియే విదేశీ పెట్టుబడిదార్లు సోవియటు విదేశవ్యాపారంపై గల సంపూర్ణాధికారాన్ని దెబ్బతీయాలనీ, విధ్వంసంచేయాలనీ ప్రయత్నించారు. దానికొరకై అప్పు నిషేధాలు ప్రయోగించారు. తద్వారా తమ ఆశయం నెర వేర్చుకోవాలని ఆశించారు.

అనువు సంబంధాలు వృద్ధిపొందినట్లయితే పెట్టుబడిదారీ దేశాలకూ సోవియటు యూనియన్‌కూ మధ్య సహకారమునకు మార్గం సుగమమైయుండేవి. అనువులపై ఆధిక వడ్డీ రేట్లను, అక్కడికక్కడనే సోవియట్ యూనియన్ చెల్లిస్తూవుండేవి. కాని పెట్టుబడిదారీ దేశాలుమాత్రం యీ అనువు నిషేధాలను దీర్ఘకాలం, మూర్ఖంగా కొనసాగించారు. సోవియటు యూని

యన్ యిబ్బందుల పాలగుసనీ, ఆ దేశపు మార్కెట్టు సంపదలపై తమ ఆధిపత్యం ఏర్పర్చుకోవాలనే తమ ఆశయం తప్పక నెరవేరి తీరగలదనే వారినెర్రి.

అయితే యీ విధానం ప్రధానంగా పెట్టుబడిదారీ దేశాలకే హానికరమైనది. తాము త్రవ్వుతున్న అరువు నిషేధపు గోతిలో తామే పడసాగారు. 1929 సం॥ పెట్టుబడిదారీ దేశాలలో సంభవించిన ఆర్థిక సంక్షోభంతో యిది మరింతగా స్పష్టమైంది. యీ సంక్షోభం సోవియట్ యూనియన్ ఛాయలకైనా పోలేదు. నిరంతరం విస్తృతమవుతున్న దేశీయ మార్కెట్టుకు అనుగుణ్యంగా ప్రణాళికాబద్ధంగా వుత్పత్తి సాగుచుండుటయే దీనికి కారణం. సంక్షోభంచే దెబ్బతిన్న పెట్టుబడిదారీ దేశాల మార్కెట్లలో అమ్ముడుపోని వస్తువులనుసైతం వుపయోగించుకోగలిగినంతగా సోవియట్ దేశీయ మార్కెట్టు విస్తృతమైంది. అరువు గనుక యిచ్చినట్లయితే, రష్యా పెద్ద మొత్తాలలో యంత్ర పరికరాలను, యితర దిగుమతులను చేసుకొనివుండేవి. ఆనాటికి వున్న పరిమితుల్లో సైతం, సోవియట్ ఆర్డర్లవల్లనే అనేక బ్రిటిష్, అమెరికన్ సంస్థలు తమ వ్యాపారాన్ని కొనసాగించుకో గలిగాయి; నిరుద్యోగం కొంతవరకు వుపశమించింది. లోహ పరిశ్రమల యంత్రాలకొరకు సోవియట్ యిచ్చిన ఆర్డర్లవల్ల, అమెరికా యంత్రోత్పత్తి శాఖలో పనిచేస్తున్నవారిలో దాదాపు మూడింట ఒకవంతు కార్మికులకు వుద్యోగాలు లభించాయి.

సోవియట్, ప్రథమ పంచవర్ష ప్రణాళికాకాలమందు, తనకు యంత్రపరికరాలను అమ్మిన సంస్థలయొక్క అరువులను,

సాంకేతిక సలహాలను స్వీకరించింది ; విదేశీ నిపుణుల సేవను వుపయోగించుకున్నది. అయితే యీ కంపెనీలు యిచ్చిన అనువులు ప్రియంగానున్నందువల్లా, అత్యల్పంగా నున్నందు వల్లనూ, సోవియట్ ప్రభుత్వం 1934 లో వీటిని వదలివేసింది. కాలక్రమేణా పెట్టుబడిదారీ దేశాలు తాము విధించిన అనువు నిషేధాలను పునరాలోచించవలసి వచ్చింది. అనువులు యివ్వ డానికి అనేక పెట్టుబడిదారీ దేశాలు సంసిద్ధతను వెల్లడించాయి. అందువల్ల 1934 తర్వాత గణించదగిన అనువులనే తీసుకుంటూ వచ్చింది. ( 1935 లో స్వీడన్ నుండి ; 1936 లో బ్రిటన్ నుండి స్వీకరించింది ). అప్పటికే సోవియట్ ప్రజలు మహత్తరమైన పంచవర్ష ప్రణాళికను పూర్తి గావించారు ; సోవియట్ యూని యన్, బలోపేతమైన పారిశ్రామిక దేశముగా పరిణామం చెం దింది. తానే యితర దేశాలకు అనువులు యివ్వగల స్తోమత లను సంపాదించింది.

ఈ విధంగా సోవియట్ దేశం, విదేశీ అప్పులు, పెట్టు బడులు, తగినంత అనువులు లేకుండానే, పారిశ్రామికం చేయ బడిందని బోధ పడుతున్నది.

## ఈ సాధన సామగ్రిని ఎక్కడనుండి సంపాదించింది?

పారిశ్రామిక కార్యక్రమాన్ని విజయవంతం చేయుటకు కావలసిన సాధన, సామగ్రి ఎక్కడ లభ్యమైంది?

ప్రథమంగా :— సోవియట్ ప్రభుత్వము, సాంఘిక వ్యవస్థల ఫలితంగా ఏర్పడిన పరిస్థితులగురించి ముందుగా కొంత చెప్పవలెను. ప్రధానమగు వుత్పత్తి సాధనములు, దేశపు సంపదలు, ప్రభుత్వ ఆస్తిగా మార్చబడినవి; పరిశ్రమలు, దేశీయ, విదేశీ వ్యాపారం, యితర ప్రభుత్వ సంస్థలద్వారా వచ్చు ఆదాయమంతయూ ప్రభుత్వపు హస్తములలో కేంద్రీకరించబడెను; అయివు విధానమునంతటినీ, (బ్యాంకులు, దేశంలో ఋణాలు, వ్యక్తిగత సేవింగ్సు డిపాజిట్లు) పారిశ్రామికం చేయు కార్యక్రమమునకే వినియోగించెను; దేశంలో నిరర్థకమైన, నిష్ఫలమైన వస్తు వినియోగంలేదు. వీటన్నిటి కంటె మిన్నగా ఆర్థికమును ప్రణాళికాబద్ధముగా అభివృద్ధి చేయుట; సంక్షోభము, నిరుద్యోగమూ లేకుండుట; తమ కొరకు, తమ ప్రభుత్వముకొరకు కృషి చేస్తున్న కార్మిక జన బాహుళ్యముయొక్క చొరవ ముఖ్యమైనవి.

సంపద ప్రోగుపడుటకు ప్రధాన సాధనము, పరిశ్రమలపై వస్తున్న ఆదాయమే. జార్ రష్యాలో, పారిశ్రామిక సంస్థలన్నీ పెట్టుబడిదార్లకే చెందియున్నవి. సోవియట్ రష్యాలో పారిశ్రామిక సంస్థలు జాతిపరం చేయబడ్డాయి; అవి ప్రభుత్వ ఆస్థిగా అయినవి. మరో మాటలో చెప్పాలంటే అవి ప్రజల ఆస్తిగా వారి పరం చేయబడ్డాయి. పూర్వం పెట్టుబడిదార్ల జేబులలోనికి పోతుండే యీ ఆదాయములో చాలభాగం దుర్వ్యయం చేయబడుతుండేది. ఇప్పుడది ప్రభుత్వమునకే చేరుతున్నది. ఉత్పత్తి కార్యక్రమాలకు మాత్రమే వుపయోగించబడుతున్నది.

జాతీయార్థిక విధానంలోని ఆదాయంవచ్చు యితర శాఖలుకూడా జాతీయం చేయబడినవి. రవాణా, రాకపోకల మార్గాలు, బ్యాంకులు, దేశంలో ప్రభుత్వం నిర్వహిస్తున్న వర్తకం, విదేశ వ్యాపారం మొదలగువాటిపై వచ్చు ఆదాయ మంతా జాతిపరం చేయబడింది.

భూస్వాముల భూమి దున్నేవారికే యివ్వబడింది. ఆ విధంగా భూస్వాములకు సాలీనా శిస్తురూపంలో యివ్వవలసిన 50,00,00,000 బంగారు రూబుల్సు భారంనుండి రైతులు విముక్తి చేయబడినారు. ఆ రైతులు, నూతన పరిశ్రమలను నెల కొల్పుటలో సహాయం చేశారు.

అప్పుల క్రిందనూ, పెట్టుబడులపై వడ్డీల రూపంలోనూ విదేశాలకు పోతూవుండిన డబ్బు యిప్పుడు దేశంలోనే వుండిపో తున్నది. సాలీనా షుమారు వందకోట్ల బంగారు రూబుల్సు యితర దేశాలకు పోతూ వుండెడిదని పైననేచెప్పాం. ఈ భారము లన్నియూ తొలగి పోవుటతో, పారిశ్రామిక కార్యక్రమాలకు కావలసిన నిధులను సమకూర్చడం సులభసాధ్యమైనది.

దిగుమతుల విధానం మార్పు చేయబడినది. ఇదికూడా చాలా ప్రాముఖ్యమైనదే. పూర్వం పెట్టుబడిదార్లకూ, భూస్వా ములకూ పనికివచ్చు విలాస వస్తువుల దిగుమతులకై పెద్ద మొత్తాలు యివ్వవలసి వస్తూండేవి. సోవియట్ ప్రభుత్వం యీ ధనంలోనుంచి ఎక్కువభాగం, యంత్ర పరికరాలు దిగుమతి చేసుకొనుటకు వుపయోగించుటవల్ల పారిశ్రామికం చేయుటకు ఎంతగానో సహాయం చేసింది.

నూతన రాజ్యాంగ యంత్రం నెలకొల్పుటతో, జారిస్టు యంత్రాంగమూ, దానితోపాటే పుట్టి పెరిగిన నిరర్థకమైన విధానాలు అంతమొందాయి. జార్ పాలనలో, పన్నులద్వారా వచ్చే ఆదాయమూ, అప్పులు, యితర మార్గాలద్వారా వచ్చు రాబడి అంతయు దుర్వినియోగం చేయబడుతుండేది. సోవియట్ ప్రభుత్వం యీ ఆచారాన్ని అంతే మొందించింది. ప్రభుత్వమునకు వచ్చు ఆదాయము అంతయూ, జాతీయార్థికమునూ, సంస్కృతిని అభివృద్ధిచేయుటకు వినియోగించబడింది.

వీటన్నిటివల్లా, అత్యంత వేగముగా పరిశ్రమల నభివృద్ధి చేయుటకు కావలసిన నిధులు నమ్మకంగా ఏర్పడినాయి.

యంత్రములసంఖ్య పెంచుట, కార్మికుల సాంకేతిక, సాంస్కృతిక విజ్ఞానపు వున్నతస్థాయీ, పనిని సువ్యవస్థితంగా నడిపించుటవల్ల, కార్మికుల వుత్పత్తిశక్తి వృద్ధియైనది; వుత్పత్తి ఖర్చులు తగ్గాయి; తద్వారా పరిశ్రమలలో హెచ్చు లాభాలు రాసాగాయి. ఈ క్రమమంతా, మరింతగా, నిరంతరాయంగా పెరిగిపోతూ వచ్చింది.

చేతికివచ్చిన నిధులను సక్రమంగా, పొదుపుగా వాడుకోవడం ప్రత్యేక ప్రాముఖ్యత గలది. లెనిన్, స్టాలిన్ ఆజ్ఞల ననుసరించి, దేశమంతటా, వుత్పత్తిస్థానము లన్నిటిలోనూ, వుత్పత్తి యంత్రాంగములోనూ, పొదుపరితనం అమలులో పెట్టబడింది. నిరుపయోగమైన, అనవసరమైన ఖర్చులన్నీ ఆపివేయబడినాయి. వాటికి వ్యతిరేకంగా పోరాటం జరుపబడింది.

పారిశ్రామికంచేయు కార్యక్రమును విజయవంతము గావించుటలో ప్రభుత్వబడ్జెటు పెద్ద పాత్ర వహించింది. జాతీయార్థికమునకు కావలసిన ధనమంతా బడ్జెటుద్వారానే చాలా వరకు యివ్వడం జరిగింది.

ఆంతరంగిక నిధులపైననే ఆధారపడి సోవియట్ ఆర్థిక వ్యవస్థను పారిశ్రామికం చేయడం జరిగింది. అందువల్ల యీ కార్యక్రమమునకు, నిరంతరం విస్తృత మగుచుండిన అంతర్గత మార్కెట్ సహాయం చేసింది. సోవియట్ ప్రభుత్వం, ప్రజల జీవిత, సాంస్కృతికాభివృద్ధికి కృషి చేసింది. దీనిపై ఆధారపడి నందువలననే పారిశ్రామికీకరణను విజయవంతంగా నెరవేర్చ గలిగింది.

ఉత్పత్తి సాధనాలపై ప్రజల యాజమాన్యము పునాదిగా గల్గిన సోవియట్ ఆర్థిక వ్యవస్థ సక్రమమైన ప్రభుత్వ ప్రణాళిక ప్రకారం అభివృద్ధియైనది. జాతీయాదాయమంతయూ శ్రామికులకే చేరుతుంది. ఈ ఆదాయము, సోవియట్ ప్రభుత్వంచే, సాంఘిక ప్రయోజనాలకొరకే క్రమబద్ధంగా వెచ్చించబడు తున్నది. ఈ ప్రణాళికవల్ల, వుత్పత్తి విస్తృతిగావడమూ, వినిమయం పెరగడమూ జరిగాయి. జాతీయార్థిక వ్యవస్థలోని వివిధ శాఖలు, తగురీతిని అభివృద్ధియగు హామీకూడా వుంది. ఆవిధంగా, సంక్షోభాలు, మాంద్యములు రూపు మాపబడినవి; నిరుద్యోగం శాశ్వతంగా రద్దు చేయబడింది; జాతీయార్థిక వ్యవస్థ ఒడుదుడుకులులేని, నిరంతరాయమైన అభివృద్ధిని గాంచినది.

జాతీయాదాయంలో షుమారు నాల్గింట మూడు వంతులు కార్మికుల వ్యక్తిగత అవసరములను తీర్చుటకు వుప యోగించబడుచున్నది. మిగిలిన ఒకవంతు కూడబెట్టబడు తున్నది; అంటే సమాజమంతటియొక్క ప్రయోజనాల కొరకై వస్తూత్పత్తిని పెంచుటకు వినియోగింపబడుచున్నదన్న మాట. సోవియట్ యూనియన్ యొక్క జాతీయాదాయమును పంచిపెట్టుటలో సోషలిజంయొక్క మూలసూత్రం ప్రతిబింబిస్తున్నది. "నిరంతరం పెరుగుతున్న సమాజంయొక్క జీవిత, సాంస్కృతిక అవసరములను, వుత్తమ నైపుణి ఆధారంతో సోషలిస్టు వుత్పత్తిని, నిరంతరం విస్తృతమొనర్చి పరిపూర్ణత చెందించుట ద్వారా ( Perfection ), గరిష్ట సంతృప్తినికల్గించుటయే" సోషలిజంయొక్క మూలసూత్రమని స్టాలిన్ చెప్పారు.

పెట్టుబడిదారీ దేశములయందు జాతీయాదాయం వేరు విధంగా వుపయోగించబడుతుంది. జనాభాలో నూటికి 90 మందిగా వున్న శ్రామిక జనబాహుళ్యమునకు, జాతీయాదాయమునందు నూటికి 40 వంతులే ముడుతున్నది. ఇలా ముట్టినదానిలో దాదాపు సగం పన్నుల రూపంలో తిరిగి ప్రభుత్వముచే తీసుకోబడుతున్నది. పోగా మిగిలిన జాతీయాదాయం యావత్తూ పెట్టుబడిదారుల జేబులలోనికే పోతున్నది. పెట్టుబడిదారీదేశాల జాతీయాదాయంలో నూటికి 4, 5 వంతులు మాత్రమే వుత్పత్తిని పెంచుటకుగాను వినియోగింపబడును. పెట్టుబడిదారులకు ఆదాయంగా వచ్చిన మిగతా ధనం సమాజాభ్యున్నతికై ఖర్చు పెట్టబడుటలేదు. దుర్వ్యయం చేయబడుతున్నది. జాతీయాదాయంలో కార్మికుల

వాటా క్రమేణా తగ్గిపోతూనే వుంటుంది. పెట్టుబడిదారీ విధానంయొక్క మూల సిద్ధాంతపు ఆచరణయొక్క ఫలితమే యిది. "ఒక దేశపు ప్రజానీకమును దోపిడిచేసి, నాశనంచేసి, పేదరికంలో ముంచుటద్వారా, యితర దేశ ప్రజలను, ప్రత్యేకముగా వెనుకబడిన దేశాల ప్రజలను బానిసత్వంలోవుంచి, కొల్లకొట్టుటద్వారా, యుద్ధాలద్వారా దేశీయార్థిక విధానమును యుద్ధపట్టాపైకి ఎక్కించుటద్వారా, పెట్టుబడిదార్లకు గరిష్ట లాభములను గ్యారంటీచేయుట" పెట్టుబడిదారీ ఆర్థిక విధానపు ప్రధాన లక్షణం. (స్టాలిన్).

సోవియట్ జాతీయాదాయం విభజించబడు పద్ధతివల్ల, సోమరిపోతు వినిమయము (Parasitical Consumption) నిరోధింపబడుతుంది; వుత్పత్తి అత్యంత విస్తృతమగును; జాతీయాదాయం క్రమంగా గణనీయముగా వృద్ధియగును. ఆ విధంగా, సోవియట్ యూనియన్‌లో, వస్తు వాడకమూ, ధనం కూడుకొనడమూ పెద్దగా జరుగుతున్నది.

పారిశ్రామికంకోసం సోవియట్ ప్రభుత్వం యిలా ఖర్చు చేసింది: మొదటి పంచవర్ష ప్రణాళిక కాలములో (1928-32) 62,50 కోట్ల రూబుల్సు; రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో, (1933-37) 13,750 కోట్ల రూబుల్సు; మూడవ పంచవర్ష ప్రణాళికయొక్క మూడు సంవత్సరాలలో (1938-40) 10,800 కోట్ల రూబుల్సు ఖర్చు పెట్టింది. వీటిలో గణించ తగిన భాగం పరిశ్రమలలోనే మూలధనంగా పెట్టబడినది.

సోవియట్ యూనియన్‌లో సాధన సంపత్తి ప్రోగుపడిన క్రమము యిదే. దేశమును పారిశ్రామికం చేయుటకై కావలసిన

సామగ్రినంతా సోవియట్ ప్రభుత్వం స్వదేశమునందే సేకరించ గలిగింది.

## "మార్షల్ ప్లాన్" ను సోవియట్ ఎందుకు నిరాకరించింది?

### యుద్ధానంతరం, విదేశీ ఋణాలపట్ల- సోవియట్ యూనియన్ వైఖరి ఏమి?

ఈ సమస్యపై సోవియట్ వైఖరిలో ఎట్టిమార్పూ రాలేదు. మారబోదు. దేశాల సమానతపైన ఒకదేశపు ఆంతరంగిక వ్యవహారములను ఆదేశ ప్రభుత్వమే నిర్ణయించు కొనునట్టి సర్వ స్వాతంత్రమును గౌరవించుట, అంతర్జాతీయ సహకారమునందు పరస్పర ప్రయోజనాలను గౌరవించుట అను అత్యంత న్యాయసమ్మతమగు సూత్రంపైననే సోవియట్ వైఖరి ఆధారపడి యున్నది.

" మార్షల్ ప్రణాళిక " అనబడు దానిక్రింద అమెరికా ప్రభుత్వ " సహాయమును " స్వీకరించవలసిందిగా సోవియట్ యూనియన్‌నుకూడా ఆహ్వానించారు. ఈ "సహాయం" యొక్క షరతులను పరీక్షించినవెనుక యీ ఆహ్వానమును తిరస్క రించింది. ఈ ప్రణాళికయొక్క ఆంతర్యమును ప్రపంచమున కెరుకపరచింది. యిరోపా దేశములయొక్క పరిశ్రమలు, విదేశ వ్యాపారము, ద్రవ్యమూ, కరెన్సీలపై పెత్తనమును అమెరికాకు

కట్టబెట్టుటకే యీ "మార్షల్ ప్లాన్" వుద్దేశించబడిందని తెలియ జెప్పింది. ఈ పథకము తీవ్రమైన ఆర్థిక దుష్ఫలితములు కలుగజేస్తుందని చెప్పింది. "సహాయమును" స్వీకరించిన దేశములు తమ ఆర్థిక స్వాతంత్రమును పోగొట్టుకొనుట, తమ జాతీయ సర్వస్వాతంత్రమును అమెరికాకు ధారాదత్తం చేయుట జరుగుతుందని హెచ్చరించింది.

మార్షల్ సహాయమును స్వీకరించిన దేశములలో యిదే జరిగింది. ఇతర దేశములలో నుండునట్టి సాధారణ వ్యాపార సంబంధాలు విచ్ఛిన్నం చేయబడినాయి; అవాంఛనీయమైన అమెరికా వస్తువులు దిగుమతి చేయబడినాయి; దేశాల ప్రధాన జాతీయ పరిశ్రమలు కోత పెట్టబడ్డాయి; నిరుద్యోగం తీవ్రమైంది; ఆ దేశాల ద్రవ్య విధానం అల్లకల్లోలమైంది; విదేశ మారకంలో దేశీయ కరెన్సీ విలువ తగ్గిపోయింది; ఆయుధధారణలో చిక్కుకున్నాయి; దేశీయార్థిక విధానం పాక్షికముగా అభివృద్ధిమైనది; అధికమైన ధరలు, పన్నులు విధింపబడినవి; ప్రజానీకం బీదరికంలో కొట్టుమిట్టాడుతున్నారు; ఆర్థిక స్వాతంత్రమూ పోయింది; జాతీయ సర్వస్వాతంత్రం దాస్యంతో పాటే అంతరించింది. అమెరికా బానిసత్వంలో వూడిగం చేయవలసి వచ్చింది.

ఈ దేశముల యందున్న స్థితిని వర్ణించుటకై అంకెలు, సమాచారము ఏకరువుబెట్టనక్కరలేదు. ఏరోజు పత్రిక తిరగవేసినా, కావలసినంత విషయం లభిస్తుంది. బ్రిటన్‌తో సహా, మార్షల్ సహాయమును స్వీకరించుతున్న దేశము లన్నియూ,

కొద్దిగానో గొప్పగానో దీని విషఫలితములను చవిచూస్తూనే వున్నాయి.

బెర్నార్డ్ బ్రెయిన్ (కన్సర్వేటివ్ పార్లమెంటు సభ్యుడు) నేషనల్ అండ్ ఇంగ్లీష్ రివ్యూ పత్రిక 1952 సంచికలో ఒక వ్యాసంవ్రాస్తూ యిలా అన్నాడు :

"మనం దీర్ఘకాలం అమెరికా సహాయముపై ఆధారపడ్డం విచారకరం. మరికొంతకాలం వరకు దానిపైననే ఆధారపడవలసి వచ్చునట్లు తోస్తున్నది. అట్టి సంబంధాలు మంచి దినాలలోనే అవాంఛనీయము. ఇక అత్యవసర పరిస్థితులలో కూడా కొనసాగించి నట్లయితే ప్రమాదకరము."

"మన యింటిలో యజమానులు ?" అను శీర్షిక క్రింద ఆయన యీ వ్యాసమును వ్రాశాడు. ఈ ప్రశ్నకు ఆయన యీ క్రింది సమాధానం యిచ్చాడు :

"మన నిక్షేపములను అభివృద్ధిపర్చుకొనుటకు స్వాతంత్రము లేదు. మన జాతుల కుటుంబమునకు లాభదాయకమగు రీతిని కామన్వెల్తు దేశాలమధ్య వ్యాపారమును కొనసాగించుటకుకూడా స్వాతంత్రము లేదు."

బ్రిటిష్ కన్సర్వేటివ్ పార్లమెంటు సభ్యుడు చెప్పిన యీ సత్యమునకు వ్యాఖ్యానము అక్కరలేదు. ఆ దేశాలస్థితి అత్యంత విషాదముగా నున్నది.

మార్షల్ దేశాలలోనేగాక, అమెరికా "సహాయమును" స్వీకరించిన మిగతా దేశాలలోకూడా యిదే స్థితి. అయితే ఆ దేశాలకు యివ్వబడిన "సహాయము", "మార్షల్

ప్రణాళిక" క్రిందగాక "ట్రూమన్ చతుస్సూత్ర కార్యక్రమం" పేరుతో, వెనుకబడిన దేశాలకిచ్చినా, అమెరికన్ "1951 సంవత్సరపు పరస్పర రక్షణచట్టం" క్రింద యిచ్చినా, పేర్లు తేడా మినహా, ఫలితంమాత్రం ఒక్కటే. "అప్పుల రక్షణ", "సహాయమును, సక్రమముగా వినియోగమును అజమాయిషీ చూచుట" అను ముసుగులో అమెరికా గుత్తపెట్టుబడిదార్లు, అమెరికా "సహాయము"ను ఎరను మ్రింగిన దేశాల ఆర్థిక వ్యవస్థపై పెత్తనం సంపాదిస్తున్నారు. ఆ దేశాలను ఆర్థికంగా బానిసత్వంలోకి నెట్టి తరువాత రాజకీయంగా దాస్యములోనికి యీడ్చుతున్నారు.

అందువల్లనే "మార్షల్ పథకం" క్రింద తనకు యిచ్చెదమన్న "సహాయమును" సోవియట్ యూనియన్ నిరాకరించించింది.

ఒక దేశంయొక్క ఆర్థిక వ్యవస్థపై పెత్తనం సంపాదించుట, దాస్యంలోకి నెట్టుటయే లక్ష్యంగాగల్గిన అప్పులు, "సహాయముల" ను స్వీకరించుటకు సోవియట్ యూనియన్ లోగడా, యిప్పుడూ, భవిష్యత్తులోకూడ వ్యతిరేకమే. ప్రజా ప్రయోజనాలే పరమావధిగా గల్గిన సోవియట్ ప్రభుత్వం యిట్టితరహా "సహాయము" లకు ప్రతికూలమే.

# శక్తివంతమైన పారిశ్రామిక దేశం-సోవియట్

సోవియట్ ఆర్థిక వ్యవస్థను పారిశ్రామికంచేయుటతో, ఆదేశం పురోగమించి, శక్తివంతమైన పారిశ్రామిక దేశంగా పరిణామం చెందింది. యుద్ధాత్పూర్వపు పంచవర్ష ప్రణాళికల కాలంలో యీ పరిణామం జరిగింది. (1928-32, 1933-37, 1938-40). ఈ కార్యమును సాధించుటకు 13 సంవత్సరాలు పట్టింది.

ఇంత తక్కువ వ్యవధిలో, మరే దేశమూ పారిశ్రామికమైనట్లు చరిత్రలో నిదర్శనం లేదు. బ్రిటన్ పారిశ్రామికం కావడానికి నూరేండ్లు పట్టింది; అంతకంటే తక్కువ కాలంలోనేగాని అనేక దశాబ్దాలవసరమయింది జర్మనీ దీన్ని సాధించడానికి. అమెరికా, ఫ్రాన్సు, జపాన్ వగైరా దేశాలుకూడా దీర్ఘకాలంలోనే యీ కార్యమును నెరవేర్చగలిగాయి.

సోవియట్ యూనియన్ ఏర్పడుటతో పారిశ్రామికోత్పత్తి విస్తృతికి సంబంధించిన ప్రమాణములూ, అభిప్రాయములూ పాతవైపోయాయి. 1917-36 సంవత్సరాలమధ్య ప్రధాన పారిశ్రామిక దేశాలలో, సాలుసరి పారిశ్రామికోత్పత్తి పెరుగుదల యిలావుంది: అమెరికాలో నూటికి 1; బ్రిటన్‌లో 0.9; సోవియట్ యూనియన్‌లో 15.5 లు వున్నది. సోవియట్ పరిశ్రమ బ్రిటిష్ పరిశ్రమకంటె 17 రెట్లు, అమెరికా పరిశ్రమకంటె 15 రెట్లు వేగంగా అభివృద్ధి యైనది. స్పష్టంగా చెప్పాలంటే, వ్యావసాయిక దేశంగానున్న సోవియట్ యూనియన్ పారిశ్రామికం కావడానికి జరిగిన మహత్తరమైన అభివృద్ధి

మొదటి, రెండవ పంచవర్ష ప్రణాళికల కాలంలోనే (1928-37) జరిగినది. ఆ కాలంలోని సంఖ్యా వివరాలను పరిశీలించి నట్లయిన, సోవియట్ యొక్క సాలుసరి పారిశ్రామికాభివృద్ధి స్థాయి, చాలా ఎక్కువగా వున్నది. పారిశ్రామికోత్పత్తి 20%, విద్యుచ్ఛక్తి 24.8%, యంత్రోత్పత్తి 32.6% అభివృద్ధి యైనది.

ఈ పారిశ్రామిక కార్యక్రమంవల్ల, సోవియట్ రష్యా 1937 నాటికే యూరోపియన్ దేశాలనన్నిటినీ మించి, పారిశ్రామికోత్పత్తిలో ప్రథమస్థానం అలంకరించింది. సోవియట్ పారిశ్రామికాభివృద్ధిలో జరిగిన యీ బ్రహ్మాండమైన అభివృద్ధిని చూచి చాలామంది విదేశీ పెద్దమనుష్యులకు నోటమాట రాలేదు. వారికి యిదంతా మాయగా, లీలగా గోచరించింది. సోవియట్ యూనియన్‌లో జరుగుతున్నదేమిటో వారికి అంతు పట్టలేదు. అభివృద్ధియైన పెట్టుబడిదారీ దేశాలకంటె ఎంతో వెనకబడియున్న రష్యా మాత్రమే వారికి తెలుసు. 1912 లో రష్యా బొగ్గు వుత్పత్తి, జర్మనీ వుత్పత్తిలో 8.2 వ వంతు, బ్రిటన్ వుత్పత్తిలో 8.5 వంతు, అమెరికా వుత్పత్తిలో 15.5 వ వంతు మాత్రమే వుండేది. ముడి ఇనుము బ్రిటిష్ వుత్పత్తిలో సగము; జర్మనీ వుత్పత్తిలో 4.6 వ వంతు; అమెరికా వుత్పత్తిలో 8.5 వ వంతు వుండేవి. 1913 సంవత్సరపు మొత్తం ప్రపంచపు పారిశ్రామికోత్పత్తిలో నూటికి 2.6 వంతులు మాత్రమే వుండేది. ఈనాడు కొన్ని పరిశ్రమలకు సంబంధించినంతవరకు యూరప్‌లో రష్యాదే అగ్రస్థానం. వ్యవసాయిక యంత్రాలు, కంబైన్లు, శకటాలు చూచినట్లయితే యూరప్‌లోని ఏ ఒక్క దేశముకంటే, అమెరికాకంటెకూడా అధికంగానే వుత్పత్తి

చేస్తున్నది. 1937 సంవత్సరం నాటికే యావత్ప్రపంచపు పారిశ్రామికోత్పత్తిలో నూటికి 15.8 వంతులు రష్యా వాటావుంది.

జారిస్టు రష్యాలో యంత్రోత్పత్తి పరిశ్రమ చాల వెనుకబడి వుండేది. అవసరమున్న యంత్రాలు, పరికరములలో ఐదింట మూడుపాళ్లు దిగుమతి చేసుకుంటూవుండేవి. అతి స్వల్పమైన స్టీమ్ బాయిలర్లు, ఆవిరి యంత్రాలు వగైరా మాత్రమే దేశంలో తయారు చేయబడుతుండేవి. సున్నితమైన, నైపుణ్యమైన యంత్రాలన్నీ విదేశాలనుండే వస్తుండేవి. కలప, యంత్ర పరికరాలు, లోహ పరిశ్రమ పరికరాలు వగైరాలలో నూటికి 88 వంతులు దిగుమతి యగుచుండెడివి. పారిశ్రామిక సంస్థలలో నైపుణ్యం తక్కువగా వుండేది. రష్యాలో ఆధునిక వుత్పత్తి సాధనములు, బ్రిటన్, జర్మనీ, అమెరికాలతో పోల్చినపుడు వరుసగా, నాల్గింట ఒకపాలు, ఐదింట ఒక భాగం, పదింట నొకవంతు మాత్రమే వుండేవి.

రెండు పంచవర్ష ప్రణాళికలు పూర్తి కావడంతో, వుత్పత్తి నైపుణ్యములోనూ, ఆధునిక యంత్రాలను అమర్చుటలోనూ యావత్ప్రపంచంలో రష్యాదే అగ్రతాంబూలం. సోవియట్ యొక్క పారిశ్రామికోత్పత్తిలో నూరింట ఎనభైవంతులు కొత్తగాకట్టబడిన లేక, పునర్నిర్మించబడిన సంస్థలలోనే వుత్పత్తి అగుచుండెను. ప్రతి యంత్రము, పరికరము, అత్యంత నైపుణ్యము గల్గిన వాటితోసహా సోవియట్ సాధనములతోనే, సోవియట్ కర్మాగారములలోనే తయారు చేయబడినాయి. వీటికొరకై దిగుమతులకు నోరు తెరుచుకొని కూర్చోవలసిన అవసరంలేదు.

1941 లో హిట్లరు రష్యాపై దండెత్తువరకు, తృతీయ పంచవర్ష ప్రణాళికక్రింద రష్యా పారిశ్రామికాభివృద్ధి అత్యంత వేగముగా జరిగినది. సోవియట్ యొక్క భారీ పారిశ్రామికోత్పత్తి, జార్ కాలంనాటికంటె (1913) 12 రెట్లున్నది. యంత్రోత్పత్తి 50 రెట్లు; విద్యుదుత్పత్తి 25 రెట్లు పెరిగినవి. లోహములు, బొగ్గు, నూనె వుత్పత్తి అనేక రెట్లు పెరిగినది. ఆహార పరిశ్రమలు, చిన్న పరిశ్రమలలో అత్యధికమైన అభివృద్ధి కనిపించింది.

ద్వితీయ ప్రపంచయుద్ధం ఆరంభమగునప్పటికి, ప్రభుత్వం క్రిందనున్న, ప్రభుత్వంచే నడుపబడుచున్న, బ్రహ్మాండమైన పారిశ్రామిక సంస్థలు, దేశమంతటా జాగ్రత్తగా నెలకొల్పబడి, అత్యంత నవీనమైన, హెచ్చు వుత్పాదకశక్తి గల్గిన యంత్రములమర్చబడినవి. పూర్వకాలంలో రష్యా దేశమున పారిశ్రామికముగా అభివృద్ధిమైన ప్రాంతములు నాల్గు మాత్రమే వుండెడివి: దక్షిణప్రాంతం, (బొగ్గు, ఇనుము, ఉక్కు) బాకూ (పెట్రోల్) పెట్రోగ్రాడ్ (లోహపరిశ్రమ) మాస్కో (బట్టలు). సోవియట్ ప్రభుత్వం ఏర్పడునప్పటికే, యూరప్ పారిశ్రామికప్రాంతం తన ప్రాముఖ్యతను కోల్పోయి, దేశ యార్థిక జీవనములో ఎట్టిపాత్రనూ వహించుట లేదు.

పారిశ్రామిక కార్యక్రమ నిర్వాహణ సంవత్సరములలో, సోవియట్ ప్రజలు నూతనముగా 8,900 పారిశ్రామిక సంస్థలను నిర్మించారు. యంత్ర పరికరములు, ట్రాక్టర్సు, కార్లు, రసాయన, విమాన పరిశ్రమలు, పరిశ్రమలకు కావలసిన కొలత, ప్రిసిషన్ సామాన్లు వగైరా పరిశ్రమలు ప్రథమము

గానే నిర్మించడం జరిగింది. అనేక పారిశ్రామిక ప్రాంతము లేర్పడినవి. వందలాది క్రొత్త పట్టణములు, పారిశ్రామిక కేంద్ర ములు నిర్మించబడినవి. వోల్గా ప్రాంతం, యూరల్స్, వుత్తర కాకసస్, ట్రాన్సుకకేషియా, మధ్యఆసియా, పశ్చిమ, ప్రాచ్య సైబీరియా ప్రాంతాలు, దూరప్రాచ్య ప్రాంతములలో బ్రహ్మాండమైన నూతన పారిశ్రామిక కేంద్రములు లేచాయి.

పారిశ్రామికం చేయుటవల్ల దేశపు ఆర్థిక వ్యవస్థయే మారిపోయింది. భారీ పరిశ్రమలకు, దాని హృదయమైన యంత్రోత్పత్తి పరిశ్రమకు ప్రాధాన్యం యిచ్చుటవల్ల, జాతీ యార్థిక వ్యవస్థయందలి శాఖ లన్నింటినీ సాంకేతికముగా పూర్తిగా పునర్నిర్మించుట, వాటిలో అత్యధికాభివృద్ధిని సాధించుట సాధ్యమైనది. పరిశ్రమలు పెద్దపెట్టున విద్యున్మయం చేయబడినాయి. దేశమునందలి అన్ని ప్రాంతములను ఆర్థిక ముగా సన్నిహితం చేయ సమర్థమైన రైల్వే మార్గములు తగినరీతిగా అభివృద్ధిమైనవి. రైల్వేల సాంకేతికస్థాయి, నైపు ణ్యమూ ఎంతగానో వృద్ధియైనవి. రైల్వేలను నిర్మిస్తూనే, దాని సరసను మోటారు రవాణా మార్గములుకూడా వేగ ముగా అభివృద్ధి చేయబడినవి. ఇవి యీనాడు దేశమంతా అలముకొని యున్నవి. జలమార్గ సౌకర్యాలుకూడా అభివృద్ధి మైనవి. దేశీయ జీవితంలో, విమానయానం పెద్ద పాత్ర వహిస్తున్నది.

వ్యవసాయమును సమిష్టిగా సాగించుటవల్ల, గ్రామీణ ప్రాంతములో త్వరితగతిని పునర్వ్యవస్థీకరించుటకు పునాది ఏర్పడినది. అక్కడక్కడా, బెదరి చిన్నవిగాను, స్వల్ప

వృత్పత్తినిసాగిస్తున్న వ్యక్తిగత రైతాంగ క్షేత్రముల స్థానే అధికో త్పాదకములైన (highly productive) పెద్ద పెద్ద సమిష్టి వ్యవసాయ క్షేత్రములు అవతరించాయి. సోవియట్ వ్యవసాయం ప్రపంచములోకల్లా ఎక్కువగా యంత్రమయం చేయ బడింది. 1940 సంవత్సరములో, సోవియట్ వ్యవసాయమునకు 5,23,000 ట్రాక్టర్లు, 1,82,000 కంబైన్లు, అత్యంతోపయోగ కరములైన వ్యవసాయ, కోత యంత్రములు యింకెన్నో వున్నవి. దీనితో రైతులయొక్క శ్రమలో ప్రధానమైన మార్పు వచ్చింది. రోజంతా, ఎండనక, వాననక, చెమటోడ్చి పని చేసి రెక్కలు ముక్కలు చేసుకొనవలసిన రోజులు గతించాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, యంత్రాలవలన రైతుల శ్రమను తగ్గించుటయేగాక అధికాదాయంకూడా వస్తున్నది. గ్రామ ప్రాంతములనుండి పేదరికం మటుమాయమైంది. సోవియట్ రైతులు నేడు సుఖమయమైన, నాగరికమైన జీవితమును అనుభవిస్తున్నారు. వ్యావసాయికోత్పత్తిని యంత్రయుక్తంచేయుట, అభివృద్ధి చెందిన సోవియట్ వ్యవసాయ శాస్త్రమును అన్వయించుట మూలమున ఉపధాన్యములు, పారిశ్రామిక పంటలు ఎక్కువైనాయి ; మొత్తం వ్యావసాయికోత్పత్తియే అధికమైనది. 1940 సంవత్సరంలో 720 కోట్ల పూడుల (పూడ్-36 పౌనులు) ధాన్యం పండింది.

భారీపరిశ్రమలు అభివృద్ధిచేయడంవలన, ప్రజానీకమునకు కావలసిన వస్తువులను తయారు చేయుటకు ఉపయుక్తమైన పారిశ్రామికోత్పత్తిని నెలకొల్పుట సాధ్యమైనది. సోవియట్ ప్రజల సాంస్కృతిక, విజ్ఞానస్థాయి అపూర్వమైన అంతస్థును

చేసుకున్నది. ప్రజలకైనందిన జీవిత, సాంస్కృతిక చైతన్యం అత్యద్భుతముగా వృద్ధియైనది.

జారిస్టు పరిపాలన విడిచివెళ్లిన తీవ్రమైన అక్షంకుల నెదుర్కొనవలసి వచ్చింది. 1917 లో సోవియట్ ప్రభుత్వం ఏర్పడిన నాటికి రష్యా ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమై యున్నది. 1914-17 యుద్ధమువల్ల చెల్లా చెదరైనది. దురాక్రమణదారులతోను, ఆంతరంగిక విప్లవప్రతిఘాతుక శక్తులతోనూ మూడు సంవత్సరములు సాగిన యుద్ధము దేశపు మూలుగుల నన్నిటినీ పీల్చివేసింది. 1920 సంవత్సరం వచ్చేటప్పటికి పరిస్థితి అత్యంత క్లిష్టముగా మారింది. పెద్దతరహా పరిశ్రమల ఉత్పత్తి నూటికి 13.1 వంతులు (1913) మాత్రమే వుంది ; ఉక్కు ఉత్పత్తి 1913 లో నూరు వుందనుకుంటే 1920 నాటికి 2.7 వంతులు మాత్రమే వుంది ; లోహగని పరిశ్రమ నూరింట 1.7 వంతులకు, నూలు బట్టలు నూరింట 5.1 వంతులకు పడిపోయింది.

ఇంతటి నికృష్ట స్థాయినుండి, సోవియట్ ప్రభుత్వం, శాంతి కాల ఆర్థిక కార్యక్రమమును ప్రారంభించవలసి వచ్చింది. సోవియట్ రష్యా సాధించిన మహత్తర కార్యములు సర్వ దేశ శ్రమ జీవులకు సంతసం కలుగజేశాయి. తన ఆర్థిక విధానాన్ని, పునర్నిర్మించి, అభివృద్ధిపర్చుటలో పెట్టుబడిదారీ దేశములు ఎట్టి సహాయమూ యివ్వలేదు. వాస్తవంగా, ఆ అభివృద్ధిని అరికట్టుటకే శతధా ప్రయత్నించాయి.

మహత్తరమైన యీ అభివృద్ధి కార్యక్రమమును గురించి పునరాలోచించు ప్రతివారూ, దేశాన్ని పారిశ్రామికం చేయ నుద్దేశించబడిన స్టాలిన్ కార్యక్రమమును జయప్రద

మొనర్చుటకు సోవియట్ ప్రజలు సాగించిన కృషియొక్క
చారిత్రాత్మక ప్రాముఖ్యతను గుర్తించక తప్పదు. యూరప్
లోని ఆయుధాగారము లన్నిటినుండి సంపాదించిన ఆయుధము
లతో ఫాసిస్టు జర్మనీ, సోవియట్‌పై యుద్ధం సాగించింది.
అయినా సోవియట్ దేశం ఫాసిస్టు జర్మనీని ఓడించింది. సోవి
యట్ దేశమును విజయవంతముగా పారిశ్రామికం చేయుట
యనునది యీ విజయమునకు ప్రధాన కారణం. 1941–45
యుద్ధంతో, సోవియట్ రష్యాయొక్క అప్రతిహతమైన పారి
శ్రామిక శక్తి, యావత్ప్రపంచమునకు చక్కగా తెలిసింది.
పారిశ్రామికం చేయుటద్వారా, సోవియట్ ప్రజల విజయము
నకు, జర్మన్ ఫాసిజముయొక్క ఉపద్రవమునుండి మానవాళికి
రక్షణకు కావలసిన భౌతిక సాంకేతిక పరిస్థితులను
కల్పించింది. జర్మన్ ఫాసిజమ్‌కు వ్యతిరేకంగా, దేశభక్తి
ప్రేరితులగు సోవియట్ ప్రజలు తమ జాతీయ విజయములను
రక్షించుటకొరకై వీరోచిత పోరాటం సాగించారు. అదే సమ
యంలో ప్రపంచ సంస్కృతినీ, నాగరికతనూ రక్షించారు.
ఫాసిస్టు అభివృద్ధి నిరోధక శక్తులపై సోవియట్ ప్రజలు
సాధించిన విజయంలో, స్టాలిన్ పంచవర్ష ప్రణాళికలు,
అమోఘమైన పాత్ర వహించాయి.

హిట్లర్ జర్మనీకి వ్యతిరేకముగా జరిగిన యుద్ధములో,
సోవియట్ రష్యా, ప్రపంచమునందలి ఏ దేశమూ పొందనంతటి,
అత్యధికమైన నష్టములను పొందింది. ఫాసిస్టులు అకస్మాత్తుగా
దాడి జరిపినందువల్ల, తాత్కాలికముగా తాము ఆక్ర
మించుకోగల్గిన – యుక్రెయిన్, బైలోరష్యా, బాల్టిక్ తీర

రిపబ్లిక్‌లు, మాల్డేవియా, ఉత్తర కాకసస్, క్రిమియా, రష్యన్ రిపబ్లిక్ యొక్క మధ్యప్రాంతములు కొన్ని - ఆర్థికంగా ప్రాముఖ్యత గల్గిన, విస్తీర్ణమైన ప్రాంతములయందలి ఆర్థిక వ్యవస్థనంతటినీ సర్వ నాశనం చేశారు. కాని, సోవియట్ దేశం యీ అగ్ని పరీక్షలో, అనుపమానంగా, అజేయంగా నిలిచింది; యుద్ధానంతరం మరింత బలంగాను, శక్తివంతంగానూ రూపొందింది.

యుద్ధం విజయవంతంగా ముగియగానే, జాతీయార్థిక విధానమును పునర్వ్యవస్థీకరించి, అభివృద్ధిపరచు ఆశయంతో, యుద్ధానంతరం పంచవర్ష ప్రణాళికను (1946-50) ప్రారంభించింది. ఈ ప్రణాళికయొక్క విస్తృతి, గొప్పదనమూ చూచి ప్రపంచం నివ్వెరబోయింది. దేశపు స్వంత సాధనములతోనే, ఎట్టి విదేశీ సహాయమూ లేకుండానే, యీ ప్రణాళిక అత్యద్భుతంగా నెరవేర్చబడింది. 1946-51 మధ్యకాలంలో, పరిశ్రమల్లో పెట్టబడిన ద్రవ్యపెట్టుబడి 320,00 కోట్ల రూబుల్సు. ఈడబ్బుతో 7000 పెద్ద పారిశ్రామిక సంస్థలు నూతనంగా నిర్మించుటయో, పునర్నిర్మించుటయో జరిగింది. అవన్నీ పనిచేయుబడు తున్నాయి. 1952 వచ్చేసరికల్లా పరిశ్రమల మూల వుత్పత్తి ఆస్తులు (Basic Production assets) యుద్ధాత్పూర్వంకంటె (1940) నూటికి 77 వంతులు ఎక్కువ. యుద్ధాత్పూర్వపు పారిశ్రామికోత్పత్తి స్థాయిని చేరుకోనుటయేగాదు; 1950 నాటికి నూటికి 73 వంతులు పెరిగింది. (1940 లో 100 వుంటే 1950 లో 173) 1951 లో యుద్ధాత్పూర్వపు వుత్పత్తికి రెట్టింపయింది. 1952 వ సంవత్సరానికి పారిశ్రామికోత్పత్తి 2.3 రెట్లు పెరిగింది.

పారిశ్రామికోత్పత్తి ఏటేటా వృద్ధియగుటతోబాటు వస్తువుల తయ్యారీకూడా సాలీనా పెరుగుతూనే వచ్చింది. యుద్ధానంతరం పరిశ్రమల పునర్నిర్మాణక్రమం పూర్తియైన తర్వాత, గత మూడుసంవత్సరములలోనూ (1949-51) ఉక్కు వుత్పత్తి 13,000,000 టన్నులు పెరిగింది. ఇంతటి పెరుగుదల కావాలన్నట్లయితే యుద్ధపూర్వపు రోజులలో 9 సంవత్సరములు తీసుకొనియుండెడిది. ఆ మూడు సంవత్సరాలలోనే (1949-51) బొగ్గు వుత్పత్తి 74,000,000 టన్నులు పెరిగింది. ఇంతటి వుత్పత్తి యుద్ధపూర్వపు దినాల్లో 6 సంవత్సరములకుగాని జరిగేదికాదు. పారిశ్రామికోత్పత్తి మొత్తంగా చూచినట్లయితే 1951, 52 సంవత్సరముల వుత్పత్తి ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలు సాగించిన కాలంలోని వుత్పత్తికంటెకూడా 22% అధికమే. సోవియట్ పరిశ్రమలు ఎంత అప్రతిహతంగా అభివృద్ధి పొందాయో యీ అంకెలు సూచిస్తాయి.

ప్రధాన వస్తువుల వుత్పత్తి 1952 లో యిలావుంది: తక్కువ రకం యినుము 25,000,000 టన్నులు, ఉక్కు 35,000,000 టన్నులు, రోల్డుమెటల్ 27,000,000 టన్నులు, బొగ్గు 300,000,000 టన్నులు, నూనె 47,000,000 టన్నులు, విద్యుచ్ఛక్తి 11,70,000 లక్షల కిలోవాట్లు.

ఇదీ యీనాటి సోవియట్ పారిశ్రామికోత్పత్తి స్థాయి.

## వివిధ రిపబ్లిక్‌లలో పారిశ్రామికాభివృద్ధి

సోవియట్ సరిహద్దులలోనున్న జాతీయ రిపబ్లిక్‌లలో పారిశ్రామికాభివృద్ధిక్రమం చాలా వేగముగా నున్నది.

సోవియట్ దేశంయొక్క మొత్తం పారిశ్రామికోత్పత్తి 1913 కంటె 8.5 రెట్లున్నది (1940 లో). ఆ కాలంలోనే జాతీయ రిపబ్లిక్‌లలో యీ అభివృద్ధి ఎక్కువగా వున్నది. కజాకిస్థాన్‌లో 22 రెట్లు, ఆర్మీనియా 22.3 రెట్లు, జార్జియాలో 26.4 రెట్లు, కిర్ఘిజియా 160 రెట్లు, తజకిస్థాన్ 242 రెట్లు.

జాతీయ రిపబ్లిక్‌లలో జరిగిన యింతటి తీవ్రమైన అభివృద్ధి, హఠాత్సంఘటన గాదు. సోవియట్‌లోని వివిధ జాతులమధ్య, జార్ నుండి ఆనవాయితీగా వచ్చిన అసమానతను రద్దు చేయుటకు వృద్ధిచెంచబడిన, లెనిన్, స్టాలిన్‌ల జాతుల విధానమును సోవియట్ ప్రభుత్వం ఆచరణలో పెట్టిన ఫలితంగానే యిది సాధ్యమైంది.

జార్ పరిపాలనాకాలంలో, సరిహద్దులలోనున్న జాతీయ ప్రాంతాలు ఎంతో వెనుకబడి యుండేవి. అక్కడి ప్రజలకెట్టి హక్కులూ లేవు. వారు, అత్యంత క్రూరమైన జాతీయ పీడనకూ, దోపిడికి గురిచేయబడినారు. పీడింపబడుచున్న జాతులను బానిసత్వంలోనే వుంచడానికి కృషిచేసింది. ఆ కృషిలో భాగంగానే, ఆ ప్రాంతములయొక్క ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధిని నిరోధించడానికి చేతనైనదంతా చేసింది. సోవియట్ ప్రభుత్వం రాగానే వివిధజాతులమధ్య యథార్థమైన సమానతను నెలకొల్పి, రష్యన్ ప్రజల కందరికీ స్వాతంత్ర్యాన్ని యిచ్చింది. సరిహద్దులవద్ద నున్న జాతీయ ప్రాంతాలు స్వశక్తిపైననే ఆధారపడేలా చేసింది. త్వరితగతిని పారిశ్రామికం చేయుటద్వారా వారి పూర్వపు వెనుకబాటును అంతమొందించింది.

రష్యన్ ప్రజల, తదితర సోవియట్ ప్రజల స్నేహ పూర్వక సహాయంవల్ల జాతీయ రిపబ్లిక్‌లను పారిశ్రామికం చేయు కార్యక్రమం దిగ్విజయమొందింది. అభివృద్ధిచెందిన పారిశ్రామిక సమిష్టిక్షేత్రరిపబ్లికులుగా రూపొందాయి. సంస్కృతి, శాస్త్ర విజ్ఞానము, కళలు వెల్లివిరిశాయి. లెనిన్, స్టాలిన్‌లు చూపించిన వివిధ జాతులమధ్య స్నేహ విధానమూ, సోవియట్ ప్రభుత్వమూ, దాని మహానాయకుడు స్టాలిన్, నిరంతరమూ చిన్నా పెద్దా తేడాలు ఎంచకుండా, సోవియట్ రిపబ్లిక్‌ల నన్నిటిని అభివృద్ధి చేయుటకు చూపిన శ్రద్ధవల్ల, సోవియట్ యూనియన్‌లోని, ప్రతి జాతీయ రిపబ్లిక్, జాతీయ ప్రాంతమూ, జాతీయ జిల్లాకు యీనాడు అత్యంత నవీనమైన పరిశ్రమలు, యంత్రయుక్తంచేయబడిన వ్యవసాయమూ వున్నాయి. అన్ని చోట్లా సాంస్కృతిక సంస్థలు అసంఖ్యాకంగా వృద్ధినొందాయి; విజ్ఞాన రంగము లన్నింటిలోనూ స్వజాతీయులైన నిపుణులు ఎంతోమంది వున్నారు.

సోవియట్‌లోని జాతీయరిపబ్లిక్‌లు పారిశ్రామికాభివృద్ధిలో, యూరప్, ఆశియా ఖండాలలోని అనేక పెట్టుబడిదారీ దేశాలను మించాయి. ఒక దేశపు పారిశ్రామికాభివృద్ధికి నిదర్శనాలలో ఒకటైన విద్యుచ్ఛక్తి పరిశ్రమాభివృద్ధిని వుదాహరణగా తీసుకున్నట్లయితే యీ క్రింది విధంగా తెలుస్తుంది. మొత్తం కోటి డెబ్బయిలక్షలు జనాభా గల్గిన కజాక్, కిర్గిజ్, ఉజ్బెక్, టర్కోమెన్, తజిక్ రిపబ్లిక్‌ల విద్యుదుత్పత్తి, 15 కోట్ల అరవైలక్షల జనాభాగల్గిన పాకిస్తాన్, ఈజిప్టు, టర్కీ, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్, సిరియా దేశాల మొత్తం విద్యుదుత్పత్తి

కంటె 3 రెట్లున్నది. సోవియట్ రిపబ్లిక్‌లలో తల ఒక్కింటికి వున్న విద్యుదుత్పత్తి, దానిపొరుగున నేవున్న ప్రాచ్యదేశాలలో కంటె 27 రెట్లున్నది.

వ్యవసాయమును యంత్రయుక్తంచేయు పరిస్థితి చూచినా యిదే పరిస్థితి. సోవియట్ ప్రభుత్వం ఏర్పడకపూర్వం ఇప్పటి తూర్పు సోవియట్ రిపబ్లిక్‌ల ప్రాంతములో మచ్చుకైనా వ్యవసాయ యంత్రాలు లేవు. ఈ తూర్పు రిపబ్లిక్‌లలో యీనాడు 121,000 ట్రాక్టర్లు, 23,000 కంబైన్లు, 102,000 ల ప్రత్తి చల్లునట్టి, ప్రత్తికోతయంత్రాలు, వందలు, వేలసంఖ్యలో యితర వ్యావసాయికయంత్రాలు, పరికరాలు పనిచేస్తున్నాయి. ఉజ్బెకిస్తాన్‌లో సాగునందున్న ప్రతి 70 హెక్టర్లకు ఒకట్రాక్టర్ పనిచేస్తుంటే, పాకిస్తాన్‌లో 9000 వేల హెక్టర్లకు ఒకటి, ఇరాన్‌లో 18,000 హెక్టర్లకు ఒకట్రాక్టరు వున్నది.

వ్యవసాయయంత్రాల సప్లయి విషయంలో, సోవియట్ తూర్పు రిపబ్లికులు, యూరప్‌లోని అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీదేశాలను మించినవి. ఉదాహరణగా ఫ్రాన్సులో సాగునందున్న 140 హెక్టర్లకు, అంటే ఉజ్బెక్ కంటె రెట్టింపుభూమికి, ఒకట్రాక్టరున్నది. ఇటలీలో 250 హెక్టర్లకు ఒకట్రాక్టరు మాత్రం వున్నది.

సోవియట్ తూర్పు రిపబ్లిక్‌లలో వ్యవసాయ యంత్రాల సప్లయి యింతగా ఉండబట్టే, అభివృద్ధి చెందిన సోవియట్ వ్యవసాయశాస్త్రమును ఆచరణలో పెట్టినందువల్లా, పంటలు అపూర్వంగా పండుతున్నాయి. ఉదా: తూర్పు రిపబ్లిక్‌లలో 1951 సంవత్సరం, ప్రత్తి వుత్పత్తి హెక్టార్‌కు సరాసరి

21 సెంటినర్లున్నది. (సెంటినర్. 220.46 పౌన్లు); ఇంతటి దిగుబడి యింతవరకు ఏ దేశములోనూ జరగలేదనేది జగద్విదితమే; ఆ సంవత్సరం, ఈఫుగో, ప్రత్తి వుత్పత్తి హెక్టరుకు 17.5 సెంటినర్లు; అమెరికాలో 8.3; టర్కీలో 7.2; పాకిస్తాన్‌లో 5.2; ఇరాన్‌లో 4.5 సెంటినర్లు మాత్రమే వున్నది.

సోవియట్ రిపబ్లిక్‌లను పారిశ్రామికం చేయడంవల్ల, ఆర్థికవిధానంలో, సంస్కృతిలో, జీవిత విధానంలో, ప్రజల జీవిత ప్రమాణంలో విపరీతమైన మార్పులు సంభవించాయి. సోవియట్ జాతుల రిపబ్లిక్‌లు, మధ్యయుగపు భూస్వామ్య వ్యవస్థనుండి సోషలిజంకు గెంతాయి. ఇట్టిది చరిత్రలో అపూర్వం.

కొంతకాలంక్రితం కజాకిస్తాన్ అనేది పటంలో అనామకంగా వుండేది. "అనంతమైన బంజర్లు, చవిటిపర్రల ప్రాంతం", "నిరుత్సాహమునకూ, దుఃఖమునకూ నిలయములు" అని యాత్రికులు యీ ప్రాంతమును వర్ణిస్తుండేవారు. ఇది ఎన్నడోగాదు; ఈ శతాబ్దపు మొదటి పాదంలోనేసుమా! కాని నేడో! సోవియట్ కజాకిస్తాన్, అత్యంతాభివృద్ధినొందిన పారిశ్రామిక దేశం. 1928-40 సంవత్సరములలో సాగిన పారిశ్రామిక కార్యక్రమ దినాలలో, సోవియట్ ప్రజలు కజాకిస్తాన్‌లో 2500 పారిశ్రామిక సంస్థలు నెలకొల్పారు. ఆ తర్వాత దశాబ్దములో మరో 3800 నిర్మించారు.

స్టాలిన్ ప్రణాళికను అనుసరించి యీ శతాబ్దపు మూడో దశాబ్దములో సోవియట్ కజాకిస్తాన్‌యందు అత్యంత శక్తివంతమైన బొగ్గు పరిశ్రమ నెలకొల్పబడింది. దానికి పునాది

'కరగాండా' బొగ్గుగనులు. బొగ్గు వుత్పత్తిలో, సోవియట్ యూనియన్‌లో యివి తృతీయస్థాన మలంకరిస్తున్నది. ఇక్కడ వుత్పత్తియైన బొగ్గుసహాయంతో, మారుమూలనున్న జిల్లాలతో సహా, యావత్తు కజాకిస్తాన్‌లోనూ ఇనుము, ఉక్కు, యంత్రోత్పత్తి, యితర పరిశ్రమలు అభివృద్ధి చేయబడినాయి. యుగయుగాలుగా మానవునికి తెలియకుండా భూగర్భమందు దాగియున్న, అశేష ఖనిజసంపదను కజాక్ ప్రజలు వెలువరించి, మానవాళి శ్రేయస్సుకై వినియోగిస్తున్నారు.

ఈ రిపబ్లిక్‌లోని క్రింది పారిశ్రామిక కేంద్రములు ప్రఖ్యాతమైనవి: బ్రహ్మాండమైన, బాల్ఖాష్ రాగి శుద్ధికర్మాగారము; ప్రపంచంలోకెల్ల పెద్దవాటిలో నొకటియగు ఛింకెంట్ సీసము ఫ్యాక్టరీ; ఉస్ట్-కమేనోగోర్స్క్ తుత్తునాగపు పరిశ్రమ; టెకెలీ సీసము, తుత్తునాగపు పరిశ్రమ; జెజ్డీ మాంగనీస్ పరిశ్రమ; జెజ్‌కజ్గాన్ గని, లోహపరిశ్రమ; కరగాండా ఇనుము, ఉక్కు ఫ్యాక్టరీ, అక్ట్యుబిన్స్క్ ఫెర్రో-ఎల్లోయ్ ఫ్యాక్టరీ; లెనినోగోర్స్క్ ఇర్టిష్‌పోలీమెటాలిక్ వర్క్సు మొదలైనవి. ఇంతేగాక, కజాక్ రిపబ్లిక్‌లో బ్రహ్మాండమైన యంత్ర నిర్మాణ శాలలు, రసాయన కర్మాగారాలు, పెద్ద బట్టలమిల్లులు, తోలు వస్తువుల కర్మాగారాలు, మాంసము, చేపలు డబ్బాలలో నిల్వ చేయు పరిశ్రమ, పంచదార ఫ్యాక్టరీలు యింకా అనేక పారిశ్రామిక ఫ్యాక్టరీలు వున్నాయి. ఎంబా నూనెబావులు గణించ తగినంతగా అభివృద్ధిచెందాయి. కజాకిస్తాన్ భూభాగమంతటా రైల్వేమార్గాలు అలుముకొని వున్నాయి.

కజాక్‌స్తాన్‌లో వ్యవసాయంకూడా పరివర్తనం చెందింది. ఈ మధ్యనే, చవిటిపర్రలు, జననివాసం తక్కువగానున్న ఎడారి ప్రాంతములు సశ్యశ్యామలం చేయబడ్డాయి. ఈ ప్రాంతములలో, యంత్రాల సహాయముతో, గోధుమ ధాన్యం, ప్రత్తి, బీట్‌దుంప, తదితర ముఖ్య వ్యవసాయపు పంటలు పండించబడుతున్నవి. ఈ రిపబ్లిక్‌లలో 3,150 సమిష్టి వ్యవసాయ క్షేత్రములున్నవి. పంటలు అద్భుతముగా పండుతున్నవి. పంచదార, బీటుదుంప, ధాన్యం, జొన్నలు, పొగాకు పండించుటలో ప్రపంచమంతటిలోనూ ప్రథమ స్థానం కజాక్ రైతులదే. ఏటేటా నీటివనరులు అభివృద్ధి చేయబడుతున్నవి. 15,00,000 హెక్టర్లకు నీరు సరఫరా చేయబడుతున్నది. రక్షణ కొరకై చెట్లు నాటు కార్యక్రమం పెద్ద ఎత్తున జరుగుతున్నది. మామూలు జంతువుల పెంపకం చాలవరకు అభివృద్ధియైనది.

సోవియట్ ప్రభుత్వం ఏర్పడిన వెనుక, కజాకిస్తాన్‌లో పెద్ద పట్టణములు నూతనముగా 20 వరకు కట్టబడ్డాయి. అనేక పారిశ్రామికావాసనులు నిర్మింపబడినవి. గ్రామాల స్వరూపం మారిపోయింది. తట్టా బుట్టా నెత్తిన వేసుకొని దేశ దిమ్మరులుగా తిరిగే ప్రాంతాల్లో పూర్వం అగుపించిన చిరిగిపోయిన గుడారములు, గ్రామములలోనుండు మట్టి మిద్దెలు యీనాడు అంతరించాయి. అందమైన సమిష్టి వ్యవసాయ క్షేత్ర గ్రామములన్నీ విశాలమైన గృహములు, హాస్పిటల్సు, ప్రసూతిశాలలు, శిశుపోషణాలయములు, పాఠశాలలు, విశ్రాంతి భవనములు, గ్రంథాలయములు, పోస్టాఫీసులు,

రేడియో కేంద్రములు, వగైరాలలో సర్వాంగ సుందరము లుగా విలసిల్లుతున్నాయి.

కజాక్ ప్రజల సంస్కృతి సర్వతోముఖంగా పెంపొందుతున్నది. పూర్వం కజాకిస్తాన్ జనాభాలో నూటికి యిద్దరు మాత్రమే అక్షరాస్యులు. ఈనాడు కజాక్ రిపబ్లిక్‌లో అందరూ చదువుకున్నవారే. 7 సంవత్సరములవరకు నిర్బంధోచిత విద్యా విధానం అమలు నందున్నది. సెకండరీ విద్యకూడా (పది సంవత్సరముల విద్యాకాలం) నానాటా అభివృద్ధి చెందుతున్నది. ఈ రిపబ్లిక్‌లో 14 లక్షల మంది బాలబాలికలు, మాతృ భాషలోనే విద్య నభ్యసిస్తున్నారు. పూర్వం కజాకిస్తాన్‌లో వున్నత విద్యాకేంద్రము మచ్చుకైనా లేదు. ఇప్పుడు 27 వున్నత విద్యా కేంద్రములు వున్నాయి. అవిగాక, 60 వేలమంది విద్యార్థులతో, అనేక సెకండరీపాఠశాలలున్నాయి. ఈ మధ్యనే నెలకొల్పబడిన కజాక్ రిపబ్లిక్ యొక్క శాస్త్రీయ అకాడమీ ఆధ్వర్యమున 46 శాస్త్రీయ సంస్థలున్నాయి. ఫ్యాక్టరీలవద్ద, వ్యవసాయ క్షేత్రములవద్దనున్న అసంఖ్యాక పరిశోధనా కేంద్రములు వీటిలో చేర్చబడలేదు. కజాక్ ప్రజల సారస్వతమూ, కళలు, దిన దిన ప్రవర్ధమానమగుచున్నవి.

కిర్ఘిజియాకూడా దీని కేమాత్రమూ తీసిపోదు. అనేక యుగాలుగా, కిర్ఘిజియన్ ప్రజలు క్రూరమైనదోపిడీవల్ల జాతీయ పీడన, నిరంకుశత్వమువల్ల, దేశద్రిమ్మరి జీవనము, బీదరికమువల్ల నికృష్టమైన బాధల ననుభవిస్తూ వచ్చారు. జార్‌పాలన రోజులలో కర్ఘిజియా అత్యంత హైన్యమును అనుభవిస్తుండేది. పరిశ్రమ ప్రారంభదశలోవుంది. వ్యవసాయమూ వెనుకబడియే

వున్నది. ఇతర రిపబ్లిక్‌లవలెనే, ఈనాడు కిర్ఘిజియాలోకూడా వుత్పత్తి శక్తులు కనీవినీ ఎరుగనంతగా అభివృద్ధియైనవి.

సోవియట్ ప్రభుత్వం వచ్చినవెనుక, కిర్ఘిజియాలో వేలాది పారిశ్రామిక కేంద్రములు నిర్మింపబడినవి. అత్యంత నవీనమైన యంత్రము లమర్చబడినవి. రిపబ్లిక్‌యొక్క ఆర్థిక వ్యవహారములలో గనిపరిశ్రమ ప్రధానమైన పాత్రవహిస్తున్నది. అనేక ప్రాంతములలో, బొగ్గుత్రవ్వి తీయబడుచున్నది. మధ్య ఆసియాలోకల్లా పెద్దదగు ఉజ్‌గెన్ బొగ్గుకేంద్రం అత్యంత వేగంగా అభివృద్ధి చేయబడుతున్నది. యంత్రోత్పత్తి పరిశ్రమ శక్తివంతంగానున్నది. లోహాన్ని కోయునట్టి, యంత్రపరికరాలు, సాధనములు, వ్యావసాయిక యంత్రములు, ట్రాక్టర్లకు కావలసిన విడిభాగములు, వగైరా తయారుచేయబడుతున్నవి. ఇనుము, ఉక్కు పరిశ్రమ, పెట్రోలియం, భవననిర్మాణ వస్తువులు, బట్టల పరిశ్రమ, దుస్తులు, కుట్టుపనిముట్లు, కాలిజోళ్ళు, పంచదారశుద్ధి, బిళ్లలు, పొగాకుపరిశ్రమలు వున్నాయి. ఒక్కటేమిటి ? సోవియట్ కిర్ఘిజియాలో అభివృద్ధి చెందని ఆధునిక పరిశ్రమఅంటూ ఏదీలేదు. పారిశ్రామికోత్పత్తి అభివృద్ధి చాల చురుకుగాను, నిరంతరముగానూ సాగుతున్నది. పారిశ్రామికోత్పత్తి 1950 లో 1940 కంటె రెండున్నర రెట్లున్నది.

సోవియట్ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత, పెద్ద నీటివనరులు నిర్మింపబడ్డాయి. రిపబ్లిక్‌లో యిదివరకెన్నడూలేని పంటలు, క్రొత్తగా ప్రవేశపెట్టబడుతున్నాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రములలో శక్తివంతమైన వ్యవసాయ యంత్రములు

అనేకం కనబడుతుంటాయి. పంటలు ఇదివరకెన్నడూ లేనంతగా పండుతున్నవి. ఉదాహరణగా సాగులోనున్న భూమివిస్తీర్ణం నూటికి 14 వంతులు మాత్రమే (1945 నుండి 50 వరకు) పెరిగింది. కాని అపరాలపంట నూటికి 40 వంతులు, పంచదార దుంప రెట్టింపు, ప్రత్తి 3½ రెట్లు పెరిగింది. మాంధాతల నాటి వ్యవసాయ విధానము, చిన్నతరహా క్షేత్రములు అమలులోనున్న ఏ దేశంలోనూ యిట్టిది సాధ్యం కానేకాదు. ఇట్టి ప్రాంతముల పంటలలో ఏ కొద్దిపాటి అభివృద్ధి జరుగవలెనన్ననూ అనేక దశాబ్దాలు పడుతుందని ప్రపంచపు టనుభవం.

కిర్ఘిజియాలో వుండే తండాలు (కుగ్రామములు) అంతరించాయి. వాటిస్థానే, ఆధునిక మున్సిపల్ సౌకర్యములు కల్గిన పట్టణములు, అభివృద్ధి చెందిన పల్లెలూ కనబడతాయి. సామాన్లు మోయడానికి గాడిదలు, కంచర గాడిదలు, యితర జంతువులు వుపయోగింపబడేవి. వాటికిబదులు యీనాడు, రైళ్లు, మోటార్లు, విమానాలు వుపయోగింపబడుచున్నవి. విద్యుచ్ఛక్తి, రేడియో సౌకర్యాలు అపరిమితంగా వ్యాప్తి చేయబడినవి.

కిర్ఘిజియాలో పూర్వం చదువు మచ్చుకైనా లేదు. వారికి అసలు లిపియే లేదు; సారస్వతమూ లేదు. ఈనాడు కిర్ఘిజియాలో చదువురానివారంటూ లేరు. ఏడు సంవత్సరములవరకు నిర్బంధ విద్యాచట్టంప్రకారం బాల బాలికలంతా బడికి వెళ్లుతున్నారు. రిపబ్లిక్ మొత్తంలో 1,627 పాఠశాలలున్నవి. వాటిలో 3,36,000 మంది బాల బాలికలు తమ మాతృభాషలోనే విద్య నభ్యసిస్తున్నారు. 10 వున్నత విద్యా

సంస్థలలోనూ, 34 ప్రత్యేక సెకండరీ పాఠశాలల్లోనూ మొత్తం 20,000 మంది విద్యార్థులున్నారు. కిర్గిజ్ ప్రభుత్వ విశ్వ విద్యాలయంకూడా వుంది. ఉన్నత, ప్రత్యేక విద్యాలయాలలో 1952 సంవత్సరం 3000 మంది పట్టభద్రులైనారు. మరో 5000 ల మంది చేర్చుకోబడినారు. ఉన్నత విద్యా విషయంలో చాలకాలంక్రితమే కిర్గిజ్ రిపబ్లిక్కు ప్రాచ్య దేశాలను, పశ్చిమ యూరప్ దేశాలనుసైతం, అధిగమించింది. ప్రతి వెయ్యిమంది ప్రజలకు 64 మంది వున్నత విద్యాలయాలలో వుంటే, ఫ్రాన్సులో 26 గురు, డెన్మార్కులో 34 గురు, ఇటలీలో 32 గురు, స్వీడన్‌లో 21 మంది, టర్కీలో 12 గురు, ఇరాన్‌లో 3 గ్గురు మాత్రమే వున్నారు. కిర్గిజ్ శాస్త్ర అకాడమీ ఆధ్వర్యమున 34 శాస్త్ర పరిశోధనా సంస్థలు ఉన్నవి. అనేక వార్తా పత్రికలు, వార, పక్ష, మాస పత్రికలు ప్రచురించబడుతున్నవి. ప్రతి సంవత్సరమూ, వందలాది పుస్తకాలు, అనేక పర్యాయములు అచ్చువేయబడుతున్నాయి. అనేక క్లబ్బులు, జాతీయ నాటకశాలలు, వున్నాయి. ప్రభుత్వ ఒపెరా నాటకశాల, అనేక యితర సాంస్కృతిక సంస్థలూ వున్నాయి.

విప్లవానికి పూర్వం కిర్గీజియా మొత్తంలో 6 చిన్న ఆసుపత్రులు మాత్రమే వున్నాయి. వాటిలో మొత్తం 100 మంచాలే వుండేవి. ఈనాడు మొత్తం 767 ఆసుపత్రులు, వైద్యశాలలు వున్నాయి. వాటిలో 6500 మంది వైద్యులు, క్రింది వుద్యోగులూ పనిచేస్తున్నారు.

కిర్గిజ్ ప్రజల జీవనప్రమాణం ఏటేటా వృద్ధిఅగుచున్నది. జీవితావసర వస్తువుల ఉత్పత్తి నానాటా పెరుగుతున్నది. ఉదా॥ తేలిక (Light industry) పరిశ్రమల ఫ్యాక్టరీలు తీసుకుందాం. 1950 నాటికి కాలిజోళ్ళ ఉత్పత్తి 2.8 రెట్లు (1940 కంటె), సిల్కు గుడ్డలు 7.8 రెట్లు, అడుగున వేసుకొను దుస్తులు 8 రెట్లు పెరిగింది. సోవియట్ యూనియన్‌లోని సోదర ప్రజలవలెనే, కిర్గిజ్ ప్రజలుకూడా సుఖమయమైన జీవితమును అనుభవిస్తున్నారు.

పితృస్వామిక, నికృష్టస్థితినుండి అత్యంత నాగరికమైన జీవితమును సోవియట్ కిర్గిజియా 20, 25 సంవత్సరములలోనే చేసుకో గలిగింది. ఇట్టి అద్భుతమైన మార్పులు చరిత్రలోనే క్రొత్త అనుభవం.

ఉజ్‌బెక్, తాజిక్, టర్కోమెన్, ఆర్మీనియన్, జార్జియా, అజర్‌బెయిజాన్, తదితర జాతీయ రిపబ్లిక్‌లు సోవియట్ పాలనలో యింతటి మహత్తరమైన అభివృద్ధి పథము నధిగమించినవి. సోవియట్ ప్రభుత్వము మధ్యప్రాంతములతో బాటు, సరిహద్దుల వద్దనున్న ప్రాంతములనుసైతం, విదేశ సహాయం లేకనే, తన స్వంత శక్తిపైనే ఆధారపడి, పారిశ్రామిక కార్యక్రమమును విజయవంతం చేసింది. లెనిన్, స్టాలిన్‌ల జాతుల విధానమును ఆచరణలో పెట్టుటద్వారా, సోవియట్ యూనియన్‌లోని వివిధ జాతులమధ్య సంపూర్ణమైన ఆర్థిక, సాంస్కృతిక సమానతను నెలకొల్పింది. పారిశ్రామిక కార్యక్రమమును నెరవేర్చుట, సాంస్కృతికాభివృద్ధిని సాధించుటమూలమున జాతీయరిపబ్లిక్‌ల లోనిప్రజలు చరిత్రాత్మకమైన విజయాలు సాధించారు; ఉత్పత్తి

శక్తులు విపరీతముగా అభివృద్ధియైనవి. సోషలిస్టు జాతుల సంస్కృతి వేయిముఖాల విస్తరిస్తున్నది.

# శాంతికి సోవియట్ చేసిన మహత్తర కృషి

సోవియట్ పంచమ పంచవర్ష అభివృద్ధి ప్రణాళికవల్ల (1951-55) అన్ని సోవియట్ రిపబ్లిక్‌లయొక్క జాతీయార్థిక శాఖలన్నింటా, ప్రజల జీవన, ఆరోగ్య, సాంస్కృతిక శాఖలలో వినూత్నమైన, అనుపమానమైన అభివృద్ధికి బాటలు వేయబడ్డాయి.

పారిశ్రామికోత్పత్తి షుమారు 70% పెరుగుతుంది. 1955 పూర్తిఅగునప్పటికి పారిశ్రామికోత్పత్తి 1940 స్థాయికి మూడు రెట్లు వుంటుంది. 1955 నాటికి ఉక్కు ఉత్పత్తి యుద్ధాత్పూర్వపు పరిమాణముకంటె $2\frac{1}{2}$ రెట్లు, బొగ్గు, నూనె ఉత్పత్తి $2\frac{1}{2}$ రెట్లు, విద్యుత్పత్తి $3\frac{1}{3}$ రెట్లు, ట్రాక్టర్లు $4\frac{1}{2}$ రెట్లు పెరుగుతుంది.

కమ్యూనిజపు బ్రహ్మాండమైన నిర్మాణములను నిరంతరాయంగా అభివృద్ధి పర్చుటకుగాను పంచమ పంచవర్ష ప్రణాళికలో స్థానం కల్పించుట యనునది ప్రాముఖ్యమైన హంశం: ఓల్గా, నీపర్, ఆముదర్యా నదులపై ఇప్పుడు కట్టబడుతున్న బ్రహ్మాండమైన హైడ్రోఎలెక్ట్రిక్ స్టేషన్లను కొనసాగించుట. 21,00,000 కిలోవాట్ల శక్తిగల్గిన క్యూబిషేవ్ జలవిద్యుత్కేంద్రము పంచవర్ష ప్రణాళిక ఆసాంతమునకు పనిచేయ నారంభ

భిస్తుంది. రమారమి 20,00,000 కిలోవాట్ల శక్తిగల్గిన, కామ, గోర్కి, మింగెఛార్, ఉస్ట్-కామెనోగోర్స్క వగైరా విద్యుత్కేంద్రములుకూడా పంచవర్ష ప్రణాళిక ఆఖరుకు పనిచేయ నారంభిస్తాయి. ఐదేండ్లు ముగిసేటప్పటికి విద్యుత్కేంద్రముల శక్తి రెట్టింపు చేయబడుతుంది. జల విద్యుత్కేంద్రములశక్తి మూడింతలు హెచ్చించబడును. విద్యుచ్ఛక్తిని విస్తృత మొనర్చు కార్యక్రమము, యుద్ధానంతర అభివృద్ధిలో ప్రాముఖ్యమగు లక్షణము. గత మూడు సంవత్సరములలోనే సోవియట్ విద్యుదుత్పత్తి 3,70,000 లక్షల కిలోవాట్లు హెచ్చింది.

జాతీయార్థిక విధానంలోని శాఖ లన్నింటా నైపుణ్యమును అభివృద్ధి చేయుటకు, యంత్రనిర్మాణ పరిశ్రమయే పునాది. అట్టి యీ పరిశ్రమలో వుత్పత్తి, పంచవర్ష ప్రణాళిక ఆఖరుకు రెట్టింపగును. గత మూడు సంవత్సరాలలో, 1600 కొత్తతరహా యంత్రాలు నిర్మింపబడినవి. పంచవర్ష ప్రణాళిక యింకెంతో అభివృద్ధికి కార్యక్రమం వేసింది. ఇప్పుడున్న యంత్రములు, యంత్ర పరికరములయొక్క నైపుణ్యమును సోవియట్ ప్రజలు, సోవియట్ దేశమును దర్శించిన అతిథులు వేనోళ్ళ కొనియాడినారు. పంచవర్ష ప్రణాళికలవల్ల యిప్పుడున్నవాటికంటె ఖచ్చితమైన, అత్యంత వుత్పాదకములైన యంత్రములు తయారుచేయబడుతాయి. ఇందువల్ల ఇనుము, ఉక్కు, బొగ్గు, నూనె, కలప మొదలగు పరిశ్రమలలోనూ, నిర్మాణ పథకములలోనూ, రవాణా, వ్యవసాయముల యందునూ, సాంకేతికముగా అత్యున్నతమైన పద్ధతులను,

ఆటోమేటిక్ కంట్రోలు విధానమును వ్యాప్తిచేయుటకు అవకాశం ఏర్పడుతుంది. కొన్ని రంగములను, ప్రత్యేకంగా వ్యవసాయమునందు, బరువుపనిని పూర్తిగా యాంత్రికం చేయుట (Mechanisation) కు వీలుకలుగును. విద్యుదుత్పత్తి హెచ్చుటతో, పరిశ్రమలో నవీన పద్ధతులను ఏర్పర్చుటకు, వ్యవసాయంలో విద్యుచ్ఛక్తితో నడిచే ట్రాక్టర్లు, యితర వ్యవసాయ యంత్రములు పనిచేయించుట సులభమగును. యంత్రనిర్మాణ పరిశ్రమను ఎంత అభివృద్ధిపర్చితే, అంతవేగంగా కార్మికుల వుత్పత్తిశక్తి హెచ్చుతుంది. అధికమగు మేలురకం ఉత్పత్తి కిదొక ముఖ్యషరతు.

పంచవర్ష ప్రణాళికక్రింద వ్యవసాయంకూడా త్వరిత గతిని అభివృద్ధి చెందుతుంది. సోవియటు వ్యవసాయపుశాఖలన్నింటా వుత్పత్తి శక్తి అత్యధికంగా నుండుట, సోవియట్ వ్యవసాయపు విశిష్టత. సోవియట్ వ్యవసాయం ఏటేటా మరింత సమర్థతతో పురోగమిస్తున్నది. ధాన్యం, పారిశ్రామిక ముడి పదార్థాలు, పశుగ్రాసం, యితర పంటలు ఎక్కు వెక్కువగా పండుచున్నవి. అపరాల సమస్య పూర్తిగా పరిష్కరించబడినది. 1952 లో, 80,000 లక్షల పూడ్లు అపరాలు పండాయి. ఇది యుద్ధాత్పూర్వపు పంటకంటె అధికమే. ప్రధాన ఆహారమగు గోధుమపంట 1940 కంటె నూటికి 40 వంతులు అధికం. పారిశ్రామిక పంటలవిషయంకూడా యింతే. విక్రయించబడుతున్న పంటల విలువలో నూటికి 40 వంతులు పారిశ్రామిక పంటలే. పంచవర్ష ప్రణాళిక యింకెంతో అభివృద్ధికి ప్రాతిపదికలువేస్తున్నది. ధాన్యం 40% నుండి

50%, ప్రత్తి 55% నుండి 60%, పంచదార దుంప 65% నుండి 70%, ద్రాక్షపండ్లు 50% నుండి 60%, పశు సంతతికూడా గణించతగినంతగాను హెచ్చుతుంది.

ప్రకృతిని మార్చుట కుద్దేశించబడిన స్టాలిన్ ప్రణాళికను ఆచరణలో పెట్టుటకై యిప్పటికంటె యింకెక్కువ కృషి చేయ వలసి యున్నది. దీని కనుగుణ్యంగానే, దేశంలో విశాలమైన భూభాగములయందు చెట్లను నాటుట, ఇసుక ప్రాంతములలో పచ్చని చెట్లు నాటుట, పట్టణాలు, పారిశ్రామిక కేంద్రముల చుట్టూ అడవుల నేర్పరచుట, నీటి వనరులు నిర్మించుట, చిత్తడి నేలలను ఎండగట్టుట, మార్చి మార్చిపంటలు వేయు విధానమును వ్యాప్తి చేయుట, కొనసాగించబడుతుంది. మన యుగంలోకల్లా ఘనమైన లెనిన్ ఓల్గా- డాన్ కాలువ ప్రాంతములోను, క్యూబిషేవ్, స్టాలిన్‌గ్రాడ్ జల విద్యుత్కేంద్ర ప్రాంతములలోను, టర్కోమేనియన్ మెయిన్ (పెద్ద) కాలువ దక్షిణ యుక్రేనియా, ఉత్తర క్రిమియా కాలువల ప్రాంతములలోనూ ప్రకృతిని మార్చుట గురుతర కర్తవ్యము. ఈ నిర్మాణములపని పూర్తి అయినట్లయితే 60,00,000 హెక్టర్ల బంజరుకు నీటి వనరులు ఏర్పడుతాయి. 2,20,00,000 హెక్టర్ల విస్తీర్ణమునకు నీరు సప్లయి అవుతుంది.

పరిశ్రమలను, వ్యవసాయమును నిర్మించి, అభివృద్ధిచేసి, బాగుచేయుటకు పంచవర్ష ప్రణాళికలో అనేక సౌకర్యములు న్నాయి. సోషలిస్టు సమాజముయొక్క, సోవియట్ ప్రజల యొక్క జీవిత, సాంస్కృతిక, అవుసరాలలో గరిష్ట సంతృప్తిని సాధించుటయే వీటన్నిటియొక్క పరమార్థం. లోగడ పంచవర్ష

ప్రణాళికలన్నిటి వలెనే యీ ప్రణాళికయొక్క లక్ష్యంకూడా సోషలిస్టు రాజ్యాంగముయొక్క, సోవియట్ ప్రజలయొక్క శ్రేయస్సును కృషిచేయుటయే. సోవియట్ ప్రజల జీవనప్రమాణం నిరంతరం హెచ్చుతున్నది. ప్రజలయొక్క బాగును, సాంస్కృతికస్థాయికి సంబంధించిన అంకెలను చూచినట్లయితే, సోవియట్ ప్రభుత్వం వాటి అభివృద్ధికి ఎంతటిశ్రద్ధ చూపుతున్నదో స్పష్టమగుచున్నది.

ప్రజావసర వస్తువులు, ఆహార పరిశ్రమలను అభివృద్ధిచేయుటకు సోవియట్ ప్రభుత్వం యుద్ధానంతరదశలో ఎంతో కృషిచేసింది. ఈ రంగములలో 1951 వుత్పత్తి యుద్ధాత్పూర్వపు స్థాయికంటె నూటికి 43 వంతులు, 1952 లో నూటికి 60 వంతులు హెచ్చింది. వస్తువులరూపేణా చెప్పాలంటే, 1952 లో వస్తువుల వుత్పత్తి యిలావుంది: నూలుబట్టలు 50,000 లక్షల మీటర్లు; ఉన్నిబట్టలు, 190,000,000 మీటర్లు; సిల్కుబట్టలు 218,000,000 మీటర్లు; కాలిజోళ్లు 37,50,00,000 జతలు; పంచదార 33,00,000 టన్నులు; వెన్న 3,80,000 టన్నులు.

భారీపరిశ్రమలోనూ, వ్యవసాయంలోనూ నిర్ణయించబడిన లక్ష్యముల చేరుకొనుటద్వారా, యీ ఐదు సంవత్సరాలలోనూ తేలిక, ఆహార పరిశ్రమల వుత్పత్తి నూటికి 70 వంతులు హెచ్చుటకు అవకాశం ఏర్పడుతున్నది. ప్రభుత్వము, కో-ఆపరేటివ్ సంస్థల, చిల్లర అమ్మకంకూడా నూటికి 70 వంతులు హెచ్చుతుంది. యుద్ధం ముగిసిన నాటినుండి యీ వ్యాపారం 2.9 రెట్లు పెరిగింది. ఇప్పటికే, యుద్ధాత్పూర్వపు స్థాయికంటె ఎంతో పెంపొందింది.

ప్రజావసర వస్తువుల ధరలలో తగ్గింపులు జరుగుతాయి. యుద్ధానంతరం 5 పర్యాయములు ధరలు తగ్గించబడినవి. అందువల్ల, సోవియట్ ప్రజల కొనుగోలుశక్తి వందల, వేల, లక్షల రూబుల్సు మేరకు హెచ్చింది. ఇప్పటి చిల్లర ధరలు, 1947 నాల్గవపాదములోని ధరలలో సగంమాత్రమే వున్నాయి. జీతాల పెంపుదల, ధరల తగ్గింపులవల్ల, ఫ్యాక్టరీ, ఆఫీస్ కార్మికుల వాస్తవ జీతములో నూటికి 35 వంతులు పెరుగుదల వస్తుంది. సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల ఆదాయం డబ్బు రూపేణా, వస్తురూపేణా కూడా, యీ ఐదు సంవత్సరాల లోనే నూటికి 40 వంతులు హెచ్చగును.

ఈ పంచవర్ష ప్రణాళిక కాలంలో, ప్రభుత్వం కేటాయించిన ధనంతో, 10,50,00,000 చదరపు మీటర్ల విస్తీర్ణములో నివాస సౌకర్యములు కల్పించబడతాయి. మున్సిపల్ సౌకర్యములు, నగరాభివృద్ధి, రవాణా, వేడిమి, లైటింగ్, ఆవిరి వగైరా సౌకర్యములకై వినియోగించు సొమ్ము $1\frac{1}{2}$ రెట్లు పెరుగుతుంది.

గ్రామాలలోనూ, పట్టణాలలోనూ పాఠశాలా భవనాలు నూటికి 70 వంతులు పెరుగుతాయి. ఈ ప్రణాళిక ఆసాంతమునకు పెద్ద పట్టణాలు, పారిశ్రామిక కేంద్రాలలో సెకండరీ విద్య సార్వజనీనము కాగలదు. ఉన్నత విద్యా కేంద్రములు, శాస్త్రపరిశోధనా శాలలు, వృత్తి విద్యాలయాలు, పోస్టల్ ట్యూషన్, సాయంత్రపు బడులు, ఫ్యాక్టరీల వద్ద యిస్తూ బడుతున్న విద్యకూడా అభివృద్ధి పొందుతాయి.

అనేక హాస్పిటల్సు, శానిటోరియములు, విశ్రాంతి గృహములు, శిశుపోషణాలయాలు, నాట్య, నాటకశాలలు, క్లబ్బులు, ఇతర సాంస్కృతిక కేంద్రాలు నెలకొల్పబడతాయి.

సోవియట్ ఆర్థికవ్యవస్థను అత్యంత శక్తివంతంగా అభివృద్ధిచేయుటకు నిర్దేశించబడిన పంచవర్ష ప్రణాళిక, సోషలిజం నుండి కమ్యూనిజం వైపుకు జరుగుతున్న పరిణామంలో ఒక పెద్ద ముందడుగు.

తన ఆర్థికవ్యవస్థను పెద్దపెట్టున అభివృద్ధిపర్చుకొనుటతో బాటు యితర దేశములకు సహాయం యివ్వగల్గినంత వున్నత దశకు సోవియట్ పారిశ్రామికాభివృద్ధి చేరుకున్నది. సోవియట్ మార్గంలోనే తమ దేశాలనుకూడా సోషలిస్టు పారిశ్రామిక పథాన నడిపిస్తూ, ఆర్థిక, సాంఘిక పరిణామములను సాగించుతున్న ప్రజాతంత్ర ప్రజాస్వామిక దేశాలకు సోవియట్ యూనియన్ గణనీయమైన సహాయ మిస్తున్నది. సమానత, జాతియొక్క-సర్వస్వతంత్రతను గౌరవించుట, స్నేహపూర్వకంగా నిస్స్వార్థంగా పరస్పరం సహాయం చేసుకొనుట అనే సూత్రాలపై ఆధారపడి, సోవియట్ రష్యా ప్రజాతంత్ర ప్రజాస్వామిక దేశాలమధ్య ఆర్థిక సహకారం నెరపబడుతున్నది. ఇట్టి షరతులపై సహకారం, సంబంధాలు ఏర్పడుట చరిత్రలో యిదే ప్రప్రథమం. ప్రజా చైనా, పోలెండ్, జెకోస్లోవేకియా, రుమేనియా, హంగరీ, బల్గేరియా, ఆల్బేనియా, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, మంగోలియన్ ప్రజా రిపబ్లిక్‌లకు సోవియట్ ఎంతో సహాయం చేసింది. పారిశ్రామికాభివృద్ధి నూతనజీవితాన్ని,

సాంఘికాభ్యున్నతినీ పొందడానికి యీ దేశాలు చేసే ప్రయత్నాలలో యీ సహాయం అత్యంత ప్రాముఖ్యమైనది.

"ఈ ప్రజాతంత్ర ప్రజాస్వామిక దేశాలకు సోవియట్ యిస్తున్న యింతటి ఉపయుక్తమైన, సాంకేతికంగా అర్హమైన సహాయమును ఏ ప్రత్యేక పెట్టుబడిదారీ దేశమూ యివ్వదు. ఈ సహకారముయొక్క అనుభవం దీనినే సూచిస్తున్నది. ఈ సహాయం అత్యంత చౌకగాను, అత్యుత్తమంగానూ వుండుటయేగాదు; పరస్పరం సహాయం చేసుకోవాలనే వాంఛ, అందరియొక్క ఆర్థికాభివృద్ధికీ సహాయం చేయాలనే కోర్కెయే యీ సహకారానికి మూలం. ఈ దేశాలలో పరిశ్రమలు త్వరితగతిని అభివృద్ధియగుటయే దీని ఫలితం. ఇంతటి వేగంగానే, పారిశ్రామికాభివృద్ధి జరిగినట్లయితే, యీ దేశాలకు పెట్టుబడిదారీ దేశాలనుండి దిగుమతుల అవసరమే వుండదు. పైగా తమ అదనపు ఉత్పత్తికై బయట మార్కెట్లను వెతుక్కోవలసిన అవసరం రావచ్చు."

—జె. వి. స్టాలిన్.

సమానత, ఉభయుల మేలు అనే ప్రాతిపదికపై అన్ని దేశాలతోనూ ఆర్థిక సహకారం నెరపుటయే సోవియట్ ఆశయం. ప్రజాతంత్ర ప్రజాస్వామిక దేశాలుకూడా యిదే పంథా ననుసరిస్తున్నవి. క్రొత్త పంచవర్ష అభివృద్ధి ప్రణాళిక బ్రహ్మాండమైన పారిశ్రామిక, వ్యావసాయికాభివృద్ధికి అవకాశం కల్పించుతున్నది. ఇదివరకు చెప్పినట్లుగానే, సమానత,

ఉభయుల మేలు ప్రాతిపదికపై సోవియట్‌తో వ్యాపారంచేయ సిద్ధంగానున్న దేశాలన్నింటితోనూ, విశాలమైన ఆర్థిక సంబంధాలు నెలకొల్పుకొనుటకు చక్కని అవకాశం కల్పిస్తున్నది.

సామ్రాజ్యవాదులు తేవాలనుకుంటున్న మూడవ ప్రపంచ యుద్ధమును ఆపుటకై కృషిచేస్తున్న శాంతికాముక శక్తులయొక్క శక్తినే, సోవియట్ ప్రజాతంత్రి, ప్రజాస్వామిక దేశాల పారిశ్రామికాభ్యున్నతి సూచిస్తుంది ; ప్రపంచ ప్రజలంతా తమ శాంతియుత కార్యకలాపములను కొనసాగించుటకు అవకాశం కల్పిస్తున్నది.

పంచవర్ష అభివృద్ధి ప్రణాళిక, శాంతికోసం, సోవియట్ సమర్పించిన మహిమాన్వితమైన నూతన కానుక.

# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA113B165 |
|---|---|
| పుస్తకం పేరు | పారిశ్రామికాభివృద్ధి విదేశీ అప్పులు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 67 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |